శ్రీ

ఆంధ్ర సాహిత్య పరిషత్పత్త్రిక

(Journal of the Telugu Academy)

చందా సంవత్సరమునకు మూఁడు రూపాయలు

సంపుటము ౪౨ } హేమలంబ సంవత్సరము / ఆశ్వయుజ కార్తికమాసములు { సంచిక ౪

# భాస్కరరామాయణము—ఆరణ్యకాండకర్త

శిష్టా రామకృష్ణశాస్త్రి

సుమా రొకశతాబ్దమునుండి భాస్కరరామాయణారణ్యకాండ కర్తృత్వమునుగూర్చి యిదమిత్థమని నిశ్చయింపరాని క్లిష్టసమస్యగా నాంధ్రవాఙ్మయమున నున్నది. కొందఱు తిక్కనతాతయగు మంత్రి భాస్కరుఁడు దానికర్తయనియు, మఱికొందఱు కాదనియు వాదోపవాదములు చెలరేగినవి. కాని వారిలో నైకీభావము కుదురలేదు. ఆవిషయమునుగూర్చి లోఁగడ 1951 స॥రం మే, జూను నెలల భారతిసంచికలలో విపులముగా చర్చించి కొన్ని బాహ్యాంతర ప్రమాణములచే, పూర్వపక్షములను విమర్శించి హుళక్కిభాస్కరుఁడే యారణ్యకాండమునకు గూడ కర్తయని సిద్ధాంతముచేసినాఁడను. దానినింతవఱకు నెవరు నాక్షేపముచేసినట్లు కానరాదు. దానికుపబలముగా భాషాదృష్టితో రచనావిశేషములను, ప్రాచీనార్వాచీనభాషాప్రయోగములనుబట్టి యారణ్యకాండరచన తిక్కన తాతయగు మంత్రిభాస్కరునిది కాఁగలదో, లేదో విచారించి, తర్వాత నారణ్యకాండరచనకును, యుద్ధకాండపూర్వభాగరచనకును నేమైన సామ్యము గలదేమో కూడ పరిశీలించి, ఈ సమస్య పరిష్కరింపఁబడవలసి యున్నది. భాషాప్రయోగవిధానము కా

క్రమమున మాఱుచుండునే కాని, ప్రతికాలమునందు నొక్కరీతిగ నుండదని భాషాశాస్త్రజ్ఞులందఱు నేకగ్రీవముగా నంగీకరించిన విషయమే. అందుచేతనే నన్నయప్రయోగములకును, తిక్కన ప్రయోగములకును గొంతభేద మాంధ్రభాషయందుఁ గనఁబడుచున్నది.

1. నన్నయభారతమున "ఉన్నవాఁడను; ఉన్నవాఁడవు; ఉన్నవాఁడు; ఉన్నదానను; ఉన్నదానవు; ఉన్నయది" అని విపులప్రయోగములనే చేసెను. కాని తిక్కనకాలమున "ఉన్నాఁడను; ఉన్నాఁడవు; ఉన్నాఁడు; ఉన్నది" అను నుచ్చారణసౌకర్యముగల రూపములను వాడి నన్నయప్రయోగమునందలి "వ"కారమును లోపింపఁజేసినాఁడు. ఈ వర్ణలోపముగల రూపములు తర్వాతికాలమునవిగా భాషాశాస్త్రజ్ఞులచేఁ బరిగణింపఁబడినవి. (చూ. చి. నా. ఆంధ్రభాషాచరిత్రము పుటలు 1482-1340). ఇట్టి యర్వాచీనరూపము లారణ్యకాండమున విశేషముగా నీ క్రిందిరీతి వాడఁబడినవి.

"ఖరాసురవరుఁడు దా నధికసేనతోడ నున్నాఁడు (ఆర I-139); దాశరథులు వచ్చినారు I-174; నామమణఁగకున్నాఁడు I-264; ఏటికి వచ్చినాఁడు I-272; వచ్చినాఁ డరణ్యంబునకుఁ II-16; అట్లయున్నాఁడ వధికపాపాత్మ II-75; ఆననంబు లీరేను ధరించినాఁడు I-108; విననియట్లున్నా రొకండైన II-109; నాయొద్దకు నేల వచ్చినాఁడవు II-249; లీలం జెందఁగ నున్నది II-307; ఆకసమున కేఁగినాఁడో II-317; ఏదిక్కున కరిగినాఁడో II-319; ఎక్కడనున్నది జానకి II-346; అలవడ నున్నాఁడు II-407; పాసి యిట్లున్నాఁడఁ II-430" మొ॥

2. నన్నయ "తోడుకొని - తోడ్కొని" అను రూపములను మాత్రమే వాడినాఁడు. ఈ రూపములు దిక్కనకాలమునుండి "తోకొని" యని మాఱినది. ఈయర్వాచీనరూపముగూడ భాస్కరరామాయణా

రణ్యకాండలో ననేకపర్యాయములు వాడఁబడినది. ఉదా :— "జన నాయక యిమ్ముం దోకొని రమ్మని మమ్మఁబనిచె I-92; నను నెక్కటిఁ దోకొని పోవుచున్నాఁడు II-108; సీతను దశాస్యుఁడు దోకొని సంతసంబుతో II-175; ధాత్రీపుత్రిఁ దోకొంచు నీవు II-410;" మొ॥

3. ఇటువంటిదే నన్నయ "తెచ్చికొనవలయు" అని పూర్ణ రూపమును ప్రయోగింపఁగా, తర్వాతకాలమునఁ దిక్కనాదులు "తెచ్చికోవలయు"నని వాడిరి. ఈ క్రొత్తరూపమే యారణ్యకాండ మునఁగూడ ప్రయోగింపఁబడినది. "అజ్ఞానసఁ దెచ్చుకోవలయునన్న' I - 254.

4. ఇట్టిదే మఱియొకటి, "పోవనాపోవవు"అనుటకు నర్వాచీన రూపముఁ "పోనాపోవవు"అని, ఈ యర్వాచీనరూప మారణ్యకాండ మునఁ గలదు. ఉదా:—"పాయకపోనాఁ బోవవు, నాయెడనే మొగ్గ దలఁచినాఁడవా" II-245.

5. నన్నయ భారతమున వ్యతిరేకమధ్యమక్రియలు, వ్యతిరేక క్త్వార్థకములపై 'ఉండును' అను క్రియను జేర్చుటవలన నేర్పడు చుండును. కాని 'ఏయకుము, పోవకుము, పెట్టకుము' అనునవి మాత్రము 'కుము'తోఁ గాన్పించుచున్నవి. (చూ. ఆం. భా. చ. సం II. పుటలు 1355& 1509). కాన నితరక్రియలకుఁగూడ 'కుము'తో వ్యతిరేకరూపము లుండుట తిక్కనాదులనుండి యర్వాచీనకాలముననే కలదు. ఇట్టి యర్వాచీనరూపముగూడ నారణ్యకాండలోఁ గాననగును. ఉదా:-"నరవర నీ తమ్ముం, డని చూడకు వీనిం బొరిగొనియెన" అర I-142.

6. ఇఁక సంధివిషయమున నన్నయ ఏమ్యాదుల 'ఇ'కారమున కెక్కడను సంధిచేయలేదు. నన్నయతర్వాత తిక్కనాదులనుండియే

ఏమ్యాదుల 'ఇ'కారమునకు సంధిని వైకల్పికముగా చేసిరి. (చూ. ఆంధ్రభాషాచరిత్ర, పుట 1342). అరణ్యకాండమున నీ యర్వాచీన రూపమగు ఏమ్యాదుల ఇకారమునకు సంధిగల రూపమే వాడఁబడినది. ఉదా:—"కోపము లేక నిదేల నన్నుఁ దాఁకనుఁగొని I-150; చెలువారు తెఱఁగులవి యేమని చెప్పఁగల I-181; అవ్వల నేమయ్యెనో" II-236 మొ॥.

7. ఇఁక ఛందోవిషయములలో యతిప్రయోగమున నన్నయ సంయుక్తాక్షరమగు 'క్ష' కారమందలి 'క' కారసంబంధాక్షరమునకే యతివేసెను కాని 'ష' కారసంబంధాక్షరమున కెక్కడను యతివేయ లేదు. (చూ. చి. నా. గారి ఆ. భా. చ. పుట 1331). కాని తర్వాత తిక్కనకాలమునుండియే "ష" కారమునకుఁగూడ యతివేయ మొదలు పెట్టఁబడినది. ఇట్టి యర్వాచీనయతిప్రయోగ మారణ్యకాండమునఁ జూపెట్టెడి. ఉదా:—"క్షితిసుత లీల నెత్తుకొని చెచ్చెర లంకకు నేగి" II-406).

పై యర్వాచీనప్రయోగములుగల భాస్కరరామాయణారణ్య కాండరచన యర్వాచీనకాలమునకు మాత్రమే చెందును కాని, తిక్కన కంటె ప్రాచీనకాలమునకుఁ జెందుటకు వీలులేదు. ఏలన, నర్వాచీనకవి ప్రాచీనభాషాప్రయోగములతోఁ బాటుగ నర్వాచీనప్రయోగములను జేయగలఁడు గాని, ప్రాచీనకవి యర్వాచీనప్రయోగములను జేయు లేఁడుగదా! పై నంజూపిన యర్వాచీనభాషాప్రయోగములు తిక్కన కాలమునుండియే కావ్యభాషయందుఁగానవచ్చునుగాని, తత్పూర్వమునఁ గానరావు. కాన నారణ్యకాండరచయిత తిక్కనతర్వాత నుండఁదగునే కాని తిక్కన పూర్వుఁడగుటకు వీలులేదు. ఇందుచే నారణ్యకాండకర్త తిక్కన తాతయగు మంత్రిభాస్కరుఁడని చెప్పుట యెంతమాత్రము నసమంజసముగ నుండదు. కాన నారణ్యకాండకర్త మంత్రిభాస్కరుఁడు

గాఁడని దృఢముగ విశ్వసింపవచ్చును. అగుచో నింక నారణ్యకాండ
కర్త యెవరై యుండురని తర్వాతప్రశ్న. ఈ విషయముగూడ భాషా
విషయికదృష్టితోఁ బరిశీలించి పరిష్కారముచేయఁబడును.

ప్రతిభాషయందుఁగల యనంతశబ్దజాలములో ప్రతికవియు
తనకు రుచించు కొన్ని విశేషశబ్దములందు మాత్రమే యాదరాభిమాన
ములు చూపి, వానిని తనరచనలందు పలుమారు లుపయోగించుట
పరిపాటియు స్వభావమునగును. ఇట్టివి శబ్దజాలముమాత్రమే కాక,
కొన్ని భావములును, వానిని వ్యక్తీకరించు భాషయందలి నానుడులు,
లోకోక్తులు మొదలగునవికూడ నగును. విశిష్టలక్షణములనుబట్టి వివిధ
కవుల భాషాశైలులు గుర్తింపనగును. ఇవి సామాన్యముగా తుల్య
వస్తువర్ణనలం దొకేవిధముగా నుండనేయుండును. కాన వీనినిబట్టి
గూడ నాయారచన లాయాకవులనని గుర్తింపఁగలుగుదుము. ఇట్లే
తిక్కన, పోతన, శ్రీనాథాదికవుల రచనలు విశిష్టతగలవియై పండితులచే
విలక్షణముకలవిగా గుర్తింపఁబడుచున్నవి. శ్రీనాథుని రచనావైలక్ష
ణ్యము క్రీడాభిరామమునందు గుర్తింపఁబడినదికదా. అట్లే, భాస్కర
రామాయణారణ్యకాండరచనారీతులు తద్యుద్ధకాండపూర్వభాగరచన
యందు స్పష్టముగఁ గనఁబడుచున్నవి. అవి క్రిందఁజూపఁబడును.

1. అరణ్యకాండకర్త "నిప్పుమంటలు, అగ్నికీలలు" అనుటకు
విశేషముగా 'విస్ఫులింగము' లని వాడును. దీనికి పర్యాయపదములగు
పావకజ్వాలాదిపదముల నాతఁ డుపయోగింపఁడు. ఇదెన్నిమార్లు వాడఁ
బడెనో కనుఁడు.

"కనదురువిస్ఫులింగములు గ్రక్కు మహాశని. I-24; కనదురు
విస్ఫులింగములు కన్నుల రాలఁగ I-129; కవిసిరి విస్ఫులింగములు
గైదువులం జెదరంగ I-192; విస్ఫులింగతతులు వివిధముఖంబుల వెడలు
నట్లు I-221; మహాశనిగతి విస్ఫులింగములు చల్లుచు II-239;" మొ॥

మఱియు నిట్లనేకస్థలములందు వాడఁబడినవి. ఈ పదము యుద్ధకాండ పూర్వభాగమునఁగూడ నిట్లే బహుస్థలములం దుపయుక్తమైనది. చూడుడు:

"చూడ్కుల నొక్కట విస్ఫులింగముల్ వెలువడ" యుద్ధ 53; హాలాహలాగ్ని లపనవ్యధూపమడర విస్ఫులింగమ్ములు వెలువడ 84; దశకంఠకఠోరకఠండనచణచండమార్గణగణస్ఫురణస్ఫుటవిస్ఫులింగ ముల్ 373; కైదువుల్ విస్ఫులింగముల నుమియ 470; గదావిస్ఫులిం గాగ్నిజ్వాలలు గన్ను లీనుకొన 509; నానావిధవిస్ఫులింగములు 519; కనుంగొనల విస్ఫులింగములు ఘోరగతిం జెదరంగ 867. విస్ఫు లింగములు సల్లు మొనం బోరిం 983." మొ॥ ఇంక ననేకస్థలము లం దీపదము ప్రయోగింపఁబడినది.

2. ఇట్లే "భ్రూకుటి"అను పదము విశేషముగా నారణ్యకాండ యుద్ధకాండ పూర్వభాగములందుఁ గూడ వాడఁబడినది. 'కనుబొమలు ముడివైచి' మొదలైన పర్యాయములు వాడఁబడలేదు. తిలకింపుఁడు: "స్ఫురదుగ్ర భ్రూకుటి భీకరమగు బలుమొగముతోడ I - 157; భుగ్నభ్రూకుటీస్ఫురదురుఫాలతలంబున I - 175; భువనభయంకర భ్రూకుటియగు ముఖశ్రేణి I - 260; స్ఫుటకోపాటోపభుగ్నభ్రూకుటి దశకముఁ I - 265. మొ॥

యుద్ధకాండ పూర్వభాగమునఁగూడ నీ పదము విశేషముగా ప్రయుక్తమైనది. "భీకరభ్రూకుటివీచులు-యుద్ధ 53; కుటిలభ్రూకుటి దుర్నిరీక్ష్యుండగుచు 57; వికటభ్రూకుటిదుర్నిరీక్ష్యుఁడగుచు 147; రోషగ్రథితభ్రూకుటిలమూర్తి 376. భుగ్నభ్రూకుటిభీకరుండగుచు 509; వికటవిశంకటభ్రూకుటి 709; అద్భుతభ్రూకుటిరేఖాభీలయు 805;" మొ॥ ఇట్లు "భుగ్నభ్రూకుటి"అని రెండుకాండములందుఁ గూడ బహువిశేషముగా వాడఁబడినది.

3. పై రీతిగనే "నుగ్గునూచమై" అను నానుడి రెండుకాండము లందు ననేకపర్యాయము లుపయుక్తమైనది.

"భూధరములు నుగ్గునూచముగ, అ I-334. గొడుగులపిండు నుగ్గునూచముగ I-204. నుగ్గునూచమై బయలుగాఁగ:-యుద్ధ 22, భుజముల నుగ్గునూచమైపోయిన-యు 294.

4. చాపకట్టువడ:— "పరిపాతవేగమ్మునఁ జాపకట్టువడఁగా అ II-391. అడవిఁజాపకట్టువడి- యుద్ధ 22.

5. వెట్టిసేయు:— "త్రిదశులు వెట్టిసేయ నిటు దివ్యపదంబుగ అరII-13; సమస్తనిలింపుల వెట్టిగొన్న-అరII-105; వరుణాదులేపతి నీ వెట్టి కియ్యకొనిరి-యుద్ధ-56.

6. మ్రుచ్చిలిరఘునాయకుసతిఁ,దెచ్చినయట్లగునె-అర- వ-140; వంచన మ్రుచ్చిలినను దెచ్చుట'-అర-169;ఇందలి భావమునుభావయుఁ గూడ యుద్ధకాండపూర్వభాగమున ననేకపర్యాయములు వాడఁ బడినవి చూడుడు.

"వంచన సీత నేల గొనివచ్చితి రావణ:—యుద్ధ-166; అరఘు నాథు దేవి వంచన గొనివచ్చి-యుద్ధ157; వసుమతీసుత నట్లు IIంచించి తెచ్చుట మగటిమికాదు-207; వంచన నన్యకాంతఁ గొనివచ్చితి,వచ్చిన కోలె-303; వంచన రాముదేవిఁ గొనివచ్చినయట్టులు గాదురోరి-484; మ్రుచ్చిలి మహీసుతఁ దేఁ జను నే-821; వంచన నన్యకాంతఁ గొని వచ్చిన తుచ్ఛుని-1038.

7. "మిన్ను పైవిఱిగిపడినట్లు"—యుద్ధ 387; మిన్నుపైనొఱఁ గిన యట్టిచందమున-యుద్ధ 727; ఆకసంబు విఱిగిపై బడ్డ-అరII-68.

8. "హస్తికి దోమకుఁ గలవాసి-అర II-100; హరిబల మెట్లు హస్తిమశకాంతర మారసి చూడ రెంటికిఁ-యుద్ధ 63.

9. మిడుతలు కార్చిచ్చుపైఁ జన్నకరణి-అర -172; మశకములక్ హరించు పెనుమంటయుఁబోలె నడంచి-అర I-246; మిడుతలు కార్చిచ్చు పయిం బడఁబోయినయట్ల చూవె-అరII-19; విశితాస్త్రమహాగ్నిలో మిడుతవై కాలం దలంపెత్తె నే అరణ్యII-101; పైనానుడే యుద్ధకాండ పూర్వభాగమునఁగూడ ననేకపర్యాయములు వాడఁబడినది. "శల భంబులకైవడి మద్వరూథినీవనశిఖపాలుగా రిపులు వత్తురుగాక-యుద్ధ 127; మిడుతలు చిచ్చువాతఁబడి నీరగుకైవడి" యుద్ధ 532; అర్చు లెనఁగ నింద్రజిచ్ఛలభంబునేర్చు-యుద్ధ-207;

10. రాముఁ డనువాఁడు దమతండ్రి యలిగి పురము, వెడలఁ ద్రోఁచినఁ దపోవేషియై అరణ్య I-287; జనకుఁడు వెడలం ద్రోఁచిన, వనమునకుం గడిమి విడిచివచ్చినవాఁడా' యుద్ధ-431: ఇచటి శబ్దవిన్యాస సామ్యమును గమనించునది.

11. రెండుకాండములందు నప్రయత్నముగ ననుప్రాసాలంకా రము లక్కడక్కడ వాడఁబడినవి.

"వ్రేటుఁ బోటు నాటు నగపాటు నొండొరు లోటువడక" అర II-137.

"తూలుచు సోలుచు వ్రాలుచు ఆలుచు అర II - 383.

"అల్లవలినాలి యుల్లంబు దల్లడిల్ల అర II - 426.

"మగుడఁ దలపాటు వ్రేటును, నగపాటును, బోటు నాటునై యని సెల్లఁగ" యుద్ధ 485. పైవానిలో సమాసశబ్దప్రయోగమును గూడ పరిశీలింపఁ దగినది.

12. ఈ రెండుకాండములందు నొకేపద్యము కొంచెము మార్పుతో వాడఁబడినదని వెనుక తెల్పిన భారతిసంచికలలో స్పష్టపఱచితిని. ఆపద్య మిది.

చ॥ పెఱుకుదునే ఫణీంద్రువిషభీకరదంష్ట్రిలు, నేల గ్రుంగఁ జే
సఱతునె, నింగి మ్రింగుదునె, చండదిశాగజదంతకాండముల్
విఱుతునె, వారిధుల్ పుడిసిలింతునె, మందర మంగుటంబునం
జెఱుముదునే, జగంబు లఱచేతికి దెత్తునె మత్తకాశినీ॥

అరణ్య II - 104.

చ॥ పెఱుకుదుమే ఫణీంద్రవిషభీకరదంష్ట్రిలు, నేల గ్రుంగఁజే
సఱతుమె, నింగి మ్రింగుదుమె, చండదిశాగజదంతకాండముల్
విఱుతుమె, వారిధుల్ పుడిసిలింతుమె, మందర మంగుటంబునం
జెఱుముదుమే, జగంబు లఱచేతికిఁ దెత్తుమె రాత్రిసేశ్వరా॥

యుద్ధ 60.

మనవాదమును ఋజువుచేయుట కిదియొకటిచాలు యదార్థమునకు.

13. రెండుకాండములందును స్రగ్ధర, మహాస్రగ్ధరవృత్తములు సమానముగ వాడఁబడినవి. మఱియు సామాన్యముగా నితరకవులెవరును వాడని 'లయవిభాతి'యను వృత్త మారణ్యకాండమునం దొక్క మారును, యుద్ధకాండపూర్వభాగమునందు మూఁడుమార్లును వాడఁబడినది.

14. ఇఁక నారణ్యకాండ, యుద్ధకాండ పూర్వభాగముల శైలిని, భావనాశక్తిని, బోల్చిచూచినపుడుగూడ నీ రెండు రచనములందు సాదృశ్యము గనబడుచున్నది. భాస్కరరామాయణమున నారణ్యకాండశైలీ రచనలు శ్రేష్ఠతరమైనవనియు తర్వాత యుద్ధకాండ పూర్వభాగ రచనము గణింపఁదగిన దనియు, పిమ్మట క్రమమున నయ్యలార్యునిది, మల్లికార్జునభట్టుని దనియు, కడకు కుమారరుద్రదేవుని దనియు కం. వీరేశలింగము మొదలైన కొందఱు నుడివిరి. కాని యీయారణ్యకాండ, యుద్ధకాండపూర్వభాగ రచనములందు గోచరించు నీ వ్యత్యాసమును బట్టి మాత్రము గల్గినది కాని, యథార్థమున కా రెండురచనలు తుల్య

ప్రశస్తి గలవని భాస్కరరామాయణమునకు దీర్ఘపీఠిక వ్రాసిన మేడే
పల్లి వెంకటరమణాచార్యులు మొదలైన యనేకపండితు లంగీకరించిరి.
కాన సమాసనన్నివేశములు గల యాయా రచనలు పరిశీలింపదగినవి.
శైలివిషయమున నుభయభాగములందు గల తేటతెలుగురచనలు, దీర్ఘ
సంస్కృతసమాసరచనలు, భావనాశక్తియు, కల్పనాశక్తియు గల భాగ
ములు పరిశీలింపఁబడుట మేలు.

1. సంస్కృతసమాసభూయిష్ఠమైన రచనగల పద్యములలో
ప్రకృతివర్ణములు గలవి కొన్ని.

(ఎ) ఈ క్రింది వానిలో నారణ్యకాండమునఁ గల పంపాసరోవర వర్ణ
నము మొదటిపద్యము. రెండవది యుద్ధకాండపూర్వ భాగమందలి
సముద్రవర్ణనము గలది.

మ॥ ప్రవిలాసాంచితసద్గభీరవిమలాంభఃపూరసంసేవ్యమా
నవిహంగోత్కరసమ్మదావహమహానక్రశ్రితాభ్యంతరన్
సవిశేషోర్మితరంగసంకులజనశ్లాఘ్యప్రభావన్, సరః
ప్రవరంబుంగని రాన్నృపాత్మజులు పంపం బెంపు సొంపారఁగన్...
అర II-423.

మ.స్ర॥ కని రారాజన్య లభ్రంకషబహులలహరీఘట్టనోద్ధూతఫేనం
బును, గంభీరాతిఘోరాద్భుతరసబదరీభూతరోదోంతరంబున్
ఘననక్రగ్రాహదర్వీకరమకరమహాకచ్ఛపానేకమీనం
బునుజూడారంగద్భువనపవనభుగ్భ్యానభోంతర్ధివార్ధిన్. యుద్ధ-29.

(బి) రెండుకాండలందును క్రూరభయంకరాకారవర్ణనలలో మొదటి
పద్యము కబంధుని రెండవది నృసింహస్వామిని గూర్చినవి.

మహాస్ర॥ సతతాసృక్పానశీలుం, జటులకఠినదంష్ట్రాప్రచయాభీలు, నానా
గతసత్త్వవ్రాతమాంసగ్రసనవివృతవక్త్రప్రచండప్రచారుం
దతఘోరస్కంధు భూతత్రసనకరబలోద్యన్మదాంధుం, దరత్రస్తా
ద్ధతదంతివ్యాఘ్రసింహాహరణనిపుణబాహాతిబంధుం గబంధున్.
అర II-386.

సీ॥ దీర్ఘకరాళోగ్రతీవ్రదంష్ట్రారుచుల్,
దిగ్దంతిదంతదీధితులఁ గ్రమ్మ
వివృతఘోరాననవివరంబు రోదసీ
కుహరాంతరాళంబు గోలఁదినూపఁ
జండాట్టహాసంపుఁ జప్పుడు సాగర
మీదుపధ్వానంబు మ్రింగికొనఁగ
నిప్పులువడిరాలు నిష్ఠురాలోకన
మినమండలస్ఫూర్తి నినుమడింప
తే॥ ఘనసటోద్ధూతవాతూలఘట్టనమునఁ
పర్వతాళి దూలఁ గంబమున వెడలి
రభసగతి గిట్టిపట్టి హిరణ్యకశిపు
మున్ను చీరిన నరసింహమూర్తి పేచ॥ యు-618.

(సి) రెండుకాండములందును రావణునిరౌద్రాకారవర్ణనముగల పద్యము లివి.

మ.స్ర॥ స్ఫుటకోపాటోపభుగ్నభ్రుకుటిదశకమున్, భూరిదృఙ్నిర్గతోల్కా-
చ్ఛటలున్, ఘర్మోదబిందుస్ఫురణాకృత తనుత్రాలనంబుల్ ప్రవాళో
ద్భటబాహాచంద్రహాసప్రభలుఁ, గ్రకచవిస్ఫారదంష్ట్రాసముద్య
త్తటిదావిర్భూతిభూతత్రిభువనముగ సభాస్థాన మెల్లం గలంగన్॥
ఆ. I. 265.

శా॥ భుగ్నభ్రూకుటిభీకరుం డగుచు నాస్ఫోటించి బాహార్గళా
లగ్నస్ఫూర్జితరోరుఖడ్గరుచిజాలంబుల్, గదావిస్ఫులిం
గాగ్నిజ్వాలలు గన్నులీనుకొన లంకాధీశుడుం గ్రోధని
ర్మగ్నుండై వడి పేరఁ బట్టుఁ డన గా రాత్రించరుల్ బల్విడన్॥
యుద్ధ. 509.

భిన్నకాండమందలి పైపద్యముల జంటలలో భావములు, భాష, వ్యక్తీకరణ విధానము మొదలైనవి తుల్యముగ నున్నట్లు పాఠకులకుఁ దోఁచక మానవుకదా.

3. భావనాశక్తిని ప్రదర్శించు పద్యములు రెండు కాండములందును కలవు. అరణ్యకాండమున శ్రీరాము నెదుర్కొనిన ఖరుని సైన్యవర్ణన మిట్లు గలదు.

సీ॥ అమరేంద్రుమీఁద దండెత్తి పేర్చి యేతెంచు
కొండలఁబోలు వేదండతతులు
ప్రకటప్రభంజనుపై నెత్తివచ్చు కా
దంబినీఁ బోలు రథవ్రజంబు
కుంభజుమీఁద మార్కొనవచ్చు నంభోధి
తరగలగమిఁ బోలు తురగచయము,
పంచాననముమీఁదఁ బలువిడి నడచు వే
దండయూథముఁబోలు దైత్యభటులు

తే॥ కులిశనమమార్గణుండును నలఘుబలుఁడు
నుగ్రతేజుండు రాజసింహుండు నైన
రాముఁ గని యార్చి నడచె నుద్దామగమన
గాఢవిభ్రాంతి మెఱయంగ ఖరుని బలముఁ. అ I-195.

యుద్ధకాండ పూర్వభాగమునఁ గల యీ క్రిందిపద్యమున కాళరాత్రి వర్ణితము :—

సీ॥ మురిసిన మణిమయముకుటపంక్తులు ప్రభా,
లీఢదిగ్దీపమాలికలు గాఁగఁ
గూలిన దళితేభకుంభముక్తికతతు,
లిచ్చిన పువ్వుదోయిళ్లు గాఁగఁ

బడి ప్రోవులై యున్న బహుగాత్రఖండముల్
            రచితమహోపహారములు గాఁగఁ
గలయంగ మడువులుగట్టిన గజఘోట
            కాదిరక్తములు మాధ్యములు గాఁగ.
తే॥ నట్లపూజనొందియుఁదనియక మహాసి,
దంష్ట్రియును నటద్భూతభేతాళయుతము
నగుచు నంతకంతకు నేచె నతులగతులఁ.
గాళరాత్రియుఁ బోలె నక్కడిది రాత్రి. యుద్ధకాం. 540.

ఈరీతిగ రెండుకాండ లందలి పద్యములందు భావనాశక్తి సమాన యోగ్యతలతోఁగూడి స్తవనీయముగ నున్నదే కాని, యొకదాని కింకొకటి తీసిపో దనియు, సమానప్రతిభావంతులరచనలే యివియనియు జెప్పకతప్పదు.

3. రావణుడు జటాయువుతో చేసినయుద్ధ మరణ్యకాండమునను, సుగ్రీవునితోఁ జేసిన మల్లయుద్ధము యుద్ధకాండపూర్వమందును గలపద్యములఁ గొన్నిటిని బోల్చిచూతము. ఇవి జటాయువు యుద్ధ వర్ణనమందలివి.

మ॥స్ర॥ కినుకం బక్షీంద్రుఁడుగ్రాకృతిఁ గదిసి దశగ్రీవు సందంద వ్రేయన్
ఘనరాత్రోద్రేకభంగిం గుదము నదుము, వేగంబమైఁ జేరుఁ జీరన్
వెనువెంటన్ బాఱుదారన్, వెస నెడఁగుసియన్ ఏచుఁ దాఁచుం
గలంచుం
దనుసంధుల్ సించు, నొంచుం దలలు సఱచు దుర్దాంతదర్పం
బెలర్పన్ అర II - 135.

తే॥ చలము శోభిల్ల నొండొరు సమయఁ జేయ,
వేగపడి పెల్లునొంచుచో "వ్రేటుఁబోటు
నాటు నగపాటు" నొండొరు లోటుపడఁగ,
దారుణంబుగఁ బోరి రప్పీరవరులు. 137.

చ॥ వాలియుఁడుఁగాక నన్నరుణపుత్త్రుఁ జటాయువుఁ దాఁకి చాక పో
నలవియె నీకు నంచుఁ, దెగటారుదుగాక దశాస్యతోడుతన్
నిలిచి పెనంగఁగాఁ బులుక నీకు వశంబె యటంచుఁ బల్కుచున్
బలమున నొవ్వఁ బోరి రటు పైకొని యొండొరు మీఁకునానలన్.

క॥ ముచ్చిలి రఘునాయకుసతిఁ,
దెచ్చిన యట్లగునె దురము ధృతిచెడి పాఱం
జొచ్చితి విన్నీ మగతన,
మచ్చపడియె నిప్పుడంచు నలుకం జలకన్ ... 140.

ఇఁక యుద్ధకాండమందలి సుగ్రీవరావణుల మల్లయుద్ధవర్ణన పద్యము
లలోఁ గొన్నియివి.

చ॥ బలువడి లాగులం బెలఁచి పట్టుచుఁ బట్టిన నూడిపోవుచున్
మలయుచుఁ దాఁకుచుం దిరిగి మర్మము లంటఁగ వ్రేయుచున్, మహీ
స్థలిఁ బడఁ దాఁచుచుం, గదియ జానువు లూఁదుచు ముష్టికూర్పరా
దుల వడినొంచుచుం గడకతో నిటు లొండొరు మీఱి వెండియున్ 179

... ... ... ... ...

ఉ॥ వంచన రాముదేవిఁ గొనివచ్చిన యట్టులు గాదు రోరి న
క్తంచర నన్ను నాహవముఖంబున డాయుట లన్న, నయ్యరే!
క్రించ సహోదరుం గరముఁ గీడ్పడి మానవుచేతఁ బొంచి యే
యించుట గాదులే నను జయించుట నీకు నటంచు నవ్వెనన్।...484

క॥ అగు నింక మావిభీషణు
తగవును నిర్విధమ యంచుఁ దటిమినఁ బైపై
మగుడఁదలపాటు వ్రేటును
నగపాటును బోటునాటునై యని సెల్లన్... 485.

ఈ రెండు యుద్ధవర్ణనలుగూడ తేట తెలుఁగు మాటలతో, చిన్నచిన్న
వాక్యములతోఁ జేయఁబడినవి. ఇందుపయుక్తములైన, శాకలు,

తన్నులు, పోటులు, వ్రేటులు మొదలైన పదములు రెంటను సమాన
ములే. పోరాడిన తీరులుగూడ తుల్యముగ నున్నట్లున్నవి. ఇట్లే రచ
నలు రెండు నేకకవికృతములనుట కెక్కువ యవకాశ మిచ్చుచున్నవి.

4. తర్వాత రెండుకాండములందును కరుణరస మెట్లు పోషింపఁ
బడినదో, యారణ్యకాండమందలి సీత శోకమును, యుద్ధకాండమందు
రాముడు పొందిన శోకమును బోల్చిచూతము. సీత శోక మిది.

శా॥ ఓహో! నా మొఱ యెవ్వరుఁ విననియ ట్లున్నా రొకండైన మీ
బాహాదర్ప మెలర్పఁ దాఁకఁడగరే బందీవిమోక్షంబు మీ
కాహా! పుణ్యముకాదె. కీర్తి యరుదే, యాలింపరే, యోరి! నై
దేహిం దెత్తువెయంచు నడ్డపడరే దిక్పాలురీద్రోహికిన్. అర॥ II-109.

... ... ... ... ...

శా॥ అన్నా, లక్ష్మణ! నిన్నుఁ బుణ్యనిధి నే నజ్ఞాననై పల్కితిఁ
న న్నాపాపము వచ్చి ముట్టుకొనియెఁ నాపాలిదైవం బనై
యిన్నీచుం బరిమార్చ. వేగ పఱతేవే నన్ను రక్షింప మీ
యన్నం గ్రన్ననఁ జీరవే యరుగవే యత్యుగ్రశిక్షింబునన్ 111

ఉ॥ హా! యను నోనరేంద్ర! యను, హా! రఘుకుంజర! నీవు వేగ రా
వే యను, నెంతదూరమున కేఁగితొకో యను, నా మొఱుంగు విం
టే యను, విన్న నీశరము లీతల లింతకుఁ ద్రుంచివై వకు
న్నే యనుఁ, గైకకోర్కి ఫలియించె బలీయను దైవమా యనన్॥112

ఈవిషయమునే యుద్ధకాండమున శ్రీరాముడు స్మరించి ఇట్లుశోకించును

ఉ॥ రక్కసుచేతఁ బట్టువడి రాజనిభానన యేగుచప్పు డే
దిక్కున నాన లేమి నలుదిక్కులుఁ జూచుచు భీతి నాథ! నీ
వెక్కడఁ జిక్కితంచు నెలుగెత్తి పొరింబొరి నన్నుఁ జీరుచుం
బెక్కుదెఱంగులన్ వగలఁ బెల్లునఁ దూలుచు నెట్టులుండెనో.

యుద్ధ 40.

ఉ॥ ఏ జనకాత్మజన్ దశరథేశ్వరు కోడల, రాముభార్యఁ జం
డో జనులార! యడ్డపడరో నరులార సురారి కంచు, నం
భోజదళాక్షి శైలవనభూములు దాఁటుచు భీతి నేఁగుచో
నీ జలరాశిఁ జూచి మది నెంత దలంకెనొ యేమిచేయుదుర్.

యుద్ధ 41.

ఈ రెండు సమానసన్నివేశము లందు వ్యక్తీకరింపఁబడిన భావములు, భాషయు, వ్యక్తీకరణ విధానము నొక్కరీతిగ నున్నవిగదా.

పై విధముగాఁ గల తుల్యరచనలనుబట్టి యారణ్యకాండకర్తయు, యుద్ధకాండపూర్వభాగకర్తయు నొక్కరే యని విశ్వసింపవలసి వచ్చుచున్నది. ఈ యాంతర ప్రమాణములు ప్రత్యేకముగా నీ సమస్యాపరిష్కారమునకు సమర్థమైనవి కాకపోయినను, వెనుకఁ జూపిన బాహ్యప్రమాణములను బలపఱచునవై యుండి, రెంటిని గలసి యీ సమస్యను నిష్కర్షగా పరిష్కరించుటకుమాత్రము సమర్థములైనవని చెప్పుట కెంతమాత్రము సంకోచింప నవసరము లేదు. కావ పైనఁ జూపిన బాహ్యాంతప్రమాణముల బలమున నారణ్యకాండమును, యుద్ధకాండపూర్వభాగమును గూడ నొక్కడే కవి రచించెను. కాని యిద్దరు గారనియు, నాకవి హుళక్కిభాస్కరుడే కాని, తిక్కనతాత యగు మంత్రిభాస్కరు డెంతమాత్రము గాడనియు, నీ రామాయణము హుళక్కి భాస్కరుని కర్తృకమునుబట్టియే భాస్కరరామాయణమని పిలువఁబడుచుండె ననియు నిస్సందేహముగ విశ్వసింపవచ్చును.

---

# నైషధాంధ్రీకరణము

"గాండీవి"

ఉపలబ్ధములైన శ్రీనాథుని ప్రబంధములలో 1405-1410 సంవత్సరములమధ్య రచింపఁబడిన నైషధము మొట్టమొదటిది. 'ఆంధ్ర కావ్యపథము దీర్చిన' వాగనుశాసనుఁడు స్వతంత్రానువాదమునకుం బోలెఁ బురాణ పరిమితమగు నాంధ్రకావ్యమార్గమును బ్రబంధోన్ముఖ మొనర్చిన శ్రీనాథుఁడు స్వతంత్రాస్వతంత్రానువాదమునకు మూల పురుషుఁడైనది యీ నైషధాంధ్రీకరణముతోడనే.

కవికృతగ్రంథములను విమర్శకుఁడు "కాలానుసరణపద్ధతి" (Chronological method) ననుసరించియుఁ 'తారతమ్యనిరూపణ పద్ధతి' (Compartive method) ననుసరించియుఁ బరిశీలించి విమర్శింప వలసిన విధి యెంతేని కలదు. కాలానుసరణ పద్ధతి యనఁగాఁ గవుల కావ్యములను వాని రచనాకాలముల ననుసరించి పఠించుట. "Chronological - the study of a writer's works in the order of their production" (Hudson.) తారతమ్యనిరూపణ పద్ధతి యనఁగా సమానేతివృత్తము గలకావ్యములనుగాని సమకాలికులు సమానధర్ములునగు కవుల గ్రంథములనుగాని భేదసాదృశ్య కల్పనము చేయుచుఁ జదువుట. "Our next step will be to sharpen our impression of his personality by comparing and contrasting him with others - with men who worked in the same field, took up the same subjects, dealt with the same problems, wrote under similar conditions, or who, for any other reason, naturally associate themselves with him in our minds" (Hudson).

వస్తుతత్త్వము సంపూర్ణముగాఁ దెలియవలెనన్నఁ దారతమ్య నిరూపణపద్ధతి యత్యంతావశ్యకము. వాఙ్మయచరిత్రకారు లీవిషయ ములు గమనింపనిచో వారి గ్రంథములు 'కాటులాగు' లతో (Catalogue) విధ్యమందుచుండును. ఆంధ్రీకృతకావ్యములను మూల ముతో పరిపోల్చి విమర్శించుట యవశ్యాచరణీయము. ఈ విమర్శక ధర్మమును బాటించుచు నాంధ్ర నైషధమును విమర్శింప సాహసించు చున్నాఁడను పండిత ప్రకాండు లనుగ్రహింతురుగాక!

I. ఔచిత్యానౌచిత్యపరిగణనము:—

శ్రీనాథుఁడు నైషధాంధ్రీకరణమున నౌచిత్యం బాదరించి యనౌ చిత్యంబు పరిహరించినట్లు చెప్పియున్నాఁడు. ఈవిషయమును బరికించు నపుడు దేశకాలపాత్రాదులు మఱువరాదు.

(1) మూలమున నలుని సౌందర్యమునకు ముగ్ధలై త్రిమూర్తుల భార్యలు, నింద్రాణియు నతనిని వలచిరని చెప్పఁబడినది. జగన్మాతలకే వ్యభిచారము నాపాదించు నీ శ్లోకములను శ్రీనాథుఁ డౌచిత్యసంరక్ష ణమునకై యాంధ్రీకరింపక విడచినాఁడు. (3-29, 30, 31, 32 శ్లో॥) వేశ్యయను తలంపుతో రంభనుగూర్చిన శ్లోకమును (3-26) మాత్రము తెనిఁగించినాఁడు. (2-54) (శ్రీవేదము వారి పీఠిక 15 పుట).

(2) శ్లో॥ న కా నిశి స్వప్నగతం దదర్శ తం
జగాద గోత్రస్ఖలితేషు కా న తమ్
తదాత్మతాధ్యాతధవా రతే చ కా
చకార వా న స్వమనో మనోద్భవమ్. (1-30)

గీ॥ వానిఁ గలలోనఁ గానని వనజముఖియు
వాని మార్పునఁ బేర్కొని మానవతియు
వానిఁగా నాత్మ భావించి వరునిఁ గవయ
నప్పలింపని సతియు లేదయ్యె నచట. (1-62)

కాలపరిభావముచే నీయాంధ్రీకరణమున ననౌచిత్యశంక శ్రీనాథున కుఁ గలిగియుండదయ్యె నని విశ్వసింపనగును. దీనికి శ్రీనాథునికృతుల లోనే నిదర్శనములు లభింపఁ గలవు.

శా॥ కాంచీకంకణతారహారకటకగ్రైవేయభూషావళుల్
లంచం బిత్తురు దూతికాతతికి లీలన్ బెండ్లపూడఁడన్న నిన్
బంచాస్త్రాపముఁ దార తార కవయుం బ్రార్థించి లోలోపలన్
బంచారామములందుఁ బవ్వెలపురిన్ బొర్ణేందుబింబాననల్.

ఈ భీమఖండపద్య మానాఁటి సాంఘిక వ్యవస్థను స్పష్టపఱచుచున్నది.

(3) 'సువర్ణశైలా దవతీర్య తూర్ణం' (3-22) అను శ్లోకము నందలి 'స్మరకేళికాలే' యనునది "సవతిపోరు తోఁపించున దగుటచే పరిశృతకార్యవిరుద్ధమై విరస మగునని వైశాఖవేళలందు అని మార్చి నాఁడు" (2-51) (శ్రీ వేదమువారి పీఠిక 13 పుట.)

శ్లో॥ అథాద్భుతేనా స్తనిమేషముద్రి
మున్నిద్రలోమాన మముం యువానమ్
దృశా పపు స్తాః సదృశః సమస్తాః
సుతా చ భీమస్య మహీ మఘోనః" (8-1)

వ॥ "పరమాద్భుతేనా స్తనిమేషముద్రుండును నిర్నిదరిరోమపరిరోహుం డును......నిర్వికారుండును నై" (4-2)

మూలశ్లోకమునుబట్టి నలుఁడు దమయంతిని మన్మథాకులుఁడై కటాక్షవీక్షణముల నాలోకించిన ట్లర్థమగును. "అద్భుతేన శైమీ సౌందర్యజనితాశ్చర్యేణ కృత్వా అస్తాత్యక్తా నిమేషముద్రా నేత్ర సంకోచరీతి ర్యేన । అత ఏవ సాత్త్వికభావనవశా దున్నిద్రిలోమాన ముద్గతరోమాంచమ్ । దృశేత్యేకవచనేన కటాక్షావలోకనం సూచి తమ్" అనినారాయణీయవ్యాఖ్య. శ్రీనాథుఁడుఁ పరమాద్భుతా స్త

నిమేషముద్రిందును, నిర్నిద్రరోమప్రరోహుండును" నని మూలము ననుసరించి వ్రాసినను నవి కేవలసౌందర్యగతాశ్చర్యమాత్రసము ద్భూతములే కాని యన్యములు కావని తెలుపుటకే 'నిర్వికారుం డును' అను నమూలకపదమును జేర్చి యౌచిత్యరక్షణము చేసినట్లు తలంపనగును.

(5) శ్లో॥ పాలీకదృష్టే మదనోన్మదిష్ణు
ర్యథాప శాలీనత మానమానమ్
తథైవ తథ్యేపి న వేనలీభే
ముగ్ధేషు కః సత్యమృషావివేకః (8_18)

గీ॥ అతివమిథ్యావలోకనాభ్యాసకలన
నిజముగా రాజుఁ జూచియు నెమ్మనమునఁ
దాల్పఁదయ్యెను శాలీనతాభరంబు
తథ్యమిథ్యావివిక్తి ముగ్ధలకుఁ గలదె. (4-3)

దమయంతియెడ మదనోన్మాదమును జెప్పుట యనౌచిత్య దోషదూషిత మగునను తలంపుతోడనే మూలమునందలి (మదనోన్మ దిష్ణుః' అనునది పరిత్యజింపఁబడినది.

(6) శ్లో॥ 'పుత్రీ సుహృద్యేన సరోరుహాణాం
యత్ప్రేయసీ చందనవాసితా దిక్' (8-77)

ఉ॥ బాలిక! నీవు హేతువుగ భానుకులాభరణంబు దక్షిణం
బేలెడు రాజు............(4-35)

'యత్ప్రేయసీ చందనవాసితా దిక్' అనునది 'స్మరకేళికాలే' అనుదానింబోలె నవతిమాత్సర్యద్యోతక మని తలంచి 'దక్షిణంబేలెడు రాజు' అని మార్చియుండును. "పితృమిత్రత్వా చ్ఛీతలాని కమలాని, ప్రియాయా శ్చందనావశవర్తినో యద్యపి,తథాపి త్వద్విషయం యమస్య

విరహదాహం శమయితుం న శక్నువంతీ త్యాశ్చర్యమ్"అని వ్యాఖ్యాత స్వారస్యములుగూడ వ్రాసియున్నాఁడు. కాన శ్రీనాథుని మార్పునకుఁ గారణ ముండునని యూహింపవగును. దిగ్విషయమున సవతిమాత్సర్య మెట్లని శంకింపఁబనిలేదు. ఇట్టివి మహాకవిప్రయోగారూఢములే.

> సీ॥ కాశి శివునకు శుద్ధాంతకాంత గాన
> దానిపై నల్గి కోపపాత్రంబ నైతిఁ
> గాశి శివునకు గౌరియాఁ గాన నేను
> దానిపై నల్గి ప్రేమపాత్రంబ నైతి'.

ఈ భీమఖండపద్య మీవిషయమునకుఁ బ్రబలప్రమాణము కానోపును.

> (7) శ్లో॥ ఏకైక మేతే పరిరభ్య పీన
> స్తనోపపీడం త్వాం వదిశంతి
> త్వాం మూర్ఛతాం నః స్మరభిల్లశల్లైః
> ర్మదే విశల్యౌషధివల్లి రేధి. (8-90)

వ॥ కుసుమశరభిల్లశరిశల్యవిశల్యౌషధీవల్లి వగు నిన్నుం బరిష్వంగంబు సేయుదు. (4-40) శ్లోకమందలి పూర్వభాగ మిట నాంధ్రీకరింపఁ బడలేదు. ఉచితానుచితాపరిజ్ఞానసమున్మిషితుఁడై యున్న నలునిచే నిట్లు చెప్పించుట యనౌచిత్య మగునని తలంచుటచేతనే శ్రీనాథుఁడు బుద్ధిపూర్వకముగా దీని నింద్రదూతికాసంభాషణమునకు మార్చి నాఁడు. "సలీల మాలింగన మోపపీడమనామయం పృచ్ఛతి వా నవస్యామ్''అని మూలమున (8-78) నుండఁగా "పాలిండ్ల గొత్తుగాఁ బరిరంభణము చేసి, యడిగె నీసేమ మయ్యమరవిభుఁడు" అని శ్రీనాథుఁడు చెప్పించినాఁడు (3-120).

(8) శ్లో॥ ఆనంద యేంద్ర మథ మన్మథమగ్న మగ్నిం
కేళీభి రుద్ధరతనూదరినూతినాభిః (8-103)
చ॥ అమరపతిఁ వరించెదవొ హవ్యవహుం జరణంబు
త్రొక్కెదో (4-48)

'మన్మథమగ్న మగ్నిం కేళీభి రుద్ధర' అనుట యనౌచిత్యపూరిత మనియే 'హవ్యవహుం జరణంబు త్రొక్కెదో' యని మార్పఁబడియుండును. 'వరణంబొనర్చెదో' యను వేదము వారిపాఠము పరిశీలనరాహిత్య కృతము.

(9) శ్లో॥ దేవీపవిత్రితచతుర్భుజవామభాగా
వాగాలపత్పునరిమాం గరిమాభిరామామ్ (11-66)
వ॥ అవ్వైదర్భితిలం బెఱింగి యా చతుర్భుజనికోడలు (5-65)

సరస్వతి విష్ణుపత్నియని యే పురాణములోనో యుండిన నుండుఁగాక! లోకరూఢికి విరుద్ధ మగుటచే ననౌచిత్య మని శ్రీనాథుఁడు దీనిని మార్చినాఁడు.

మూలమున భీమరాజు విష్ణువును స్తుతించినట్లును సతిని యాదే శముచే సరస్వతి సభామధ్యమున నవతరించినట్లును గలదు (10-68-73 వఱకుఁ గల శ్లోకములు) శ్రీనాథుఁడు హరిప్రసంగమును వదలి భీము రాజే యమ్మహాదేవి నిట్లని ప్రస్తుతించె (4-137) నని దండకరూపమున సరస్వతీస్తుతి సందర్భపఱిచినాఁడు. హర్షుఁడు భీమరాజుచే విష్ణుస్తుతి చేయించుటకుఁ గారణము సరస్వతి విష్ణుపత్ని యను నాతని వర్ణనమే హేతుభూతము కానోపు నని యూహింపనగును. దీనిని బరిత్యజించిన శ్రీనాథుఁడు విష్ణుస్మరణమును వదలుట సందర్భోచితమే యగుచున్నది.

(10) శ్లో॥ ముఖేవిధాయక్రముకం నలానుగై
రథొజ్ఝి పర్ణాలి రవేక్ష్య వృశ్చికమ్
సమార్పతాస్త్రద్భుఖవాసనిర్మితం
భయాదిలైః సంభ్రమహాసితాఖిలైః (16-110)

చ॥ కలికి వరాటరాజడపకప్పురవీడెము వెట్టనవ్వుచున్
నలునడపంబువానికి ఫణాధరవల్లి దళాంతరంబునన్
బలితపుఁ దేలు మైనముసఁ బన్ని; యతం డది చూచి భీతిఁ ద
మ్ముల మిల వైచిన న్నగిరి మూగినరాజకుమారు లందఱున్
(6-141)

వరాటరాజు దమఁ డడపమువానితోఁ బరియాచకమాడె ననుట సముచితముకాదు కావున వరాటరాజదపనలునడపంబువానితోఁ బరియాచక మాడినట్లు శ్రీనాథుఁడు మార్చినాఁడు. శ్రీవేదమువారు 'అడప'యనుచో 'నవుడు' అను పాఠము గ్రహించి 'కలికివరాట రా జనఁగాఁగుమారవరాటరా జనియుఁ బెద్దరాజున కనౌచిత్యమగును గాని చిన్నరాజునకుఁ గాదనియు వ్రాయుట చింత్యము. 'రాజడప' యనుచో నుగాగ ముపేక్షించుట శ్రీనాథసమ్మతి మని నైషధమునందలి ప్రయోగాంతరములు రూఢమూల మొనర్చుచుండఁగా వేదమువా రన్యథాకరించుట యుక్తము కానేరదు. (వ్యాకరణ సంహితా సర్వస్వము).

హర్షుఁడు హంసాకారచిత్రణసందర్భమున "స తిర్యగావర్జిత కంధర శ్శిరః పిధాయ పక్షేణ రతిక్లమాలసః" (1-121) అని చెప్పి యున్నాఁడు. ఆహంసయే నలునితోఁ దనభార్యనుగూర్చి చెప్పుచు "నవప్రసూతి ర్వరటా తపస్వినీ" (1-135) అన్నట్లు వ్రాసినాఁడు. "నవప్రసూతి ర్వరటా తపస్వినీ అను వక్ష్యమాణశ్లోకోక్తిని విరోధించు నని 'రతిక్లమాలసః' అను విశేషణమును త్యజించుట...కానగును" అని వేదమువారు పీఠికలో వివరించినారు. శ్రీనాథుఁడు 'నవప్రసూతి ర్వరటా తపస్వినీ' యనుదానిని బరిత్యజించి వేఱుగా మార్చుట వీరు గమనించినట్లులేదు. నవప్రసూతియైన భార్యతోడి సంగమము శాస్త్ర

నిషిద్ధ మని 'రతిక్లమాలసః' అనునది యనౌచిత్యశంకచేఁ బరిత్యజింపఁ బడినదని కొందఱు చెప్పుదురు. 'నవప్రసూతి ర్వరటా తపస్వినీ' అను దానిని వదలి శ్రీనాథుఁడు 'ఇల్లాలు కడు సాధ్వి యేమియు నెఱుఁగదు, పరమపాతివ్రత్యభవ్యచరిత'యని చేర్చినాఁడు. ఈవిషయమును వేదము వారిననుసరించి వీరును గమనింపలే దని తోఁచుచున్నది. శ్రీనాథుఁడు హంసాకారకల్పనము నాంధ్రీకరణమునఁ దెచ్చుటలో యత్నించినట్లే కనఁబట్టను. మీఁదుమిక్కిలి హంసాకారస్ఫూర్తికి భంజక మగునట్లు వ్రాసె నని చెప్పవలసియున్నది. (శ్రీ వజ్ఝలవారి హం.స. పీఠిక) 'నవప్రసూతి ర్వరటా తపస్వినీ'యనుదానికంటె'ఇల్లాలు కడుసాధ్వి యేమియు నెఱుఁగదు. పరమపాతివ్రత్యభవ్యచరిత' యనుటయే సార్థకము. అనపాయిని సంశ్రియద్రుమే,గజభగ్నే పతనాయ వల్లరీ''(కుమార 4-31) యన్నట్లు తన్ను విడిచిపెట్టినచోఁ దనభార్య సాధ్వియుఁ బరమపతివ్రతయుఁ గావున దుస్సహావిరహవేదనాదోదూయమానమానసయై మరణింపఁగలదనుభావము ద్యోతకముచేయుచుఁ గరుణారసము నత్యంత పుష్టముచేయుచున్న దని గ్రహింపవలెను.

## II శబ్దానుసరణము :—

ఆంధ్రీకర్త విద్వజ్జనైకవేద్యము లగుకావ్యముల నాంధ్రీకరించునపు డందలి ముఖ్యాంగములలో నొకటగు శయ్యాసౌభాగ్యమును విస్మరించినచో మూలకవి కపచారచేయు టటుండ మూలగ్రంథశోభను సగమునకుఁబైగాఁ బరిత్యజించిన ట్లగును. ఈ రహస్యము నెఱిఁగిన శ్రీనాథుఁడు మూల పద్యపాదములను గొన్నియెడల యథాతథముగా గ్రహించినాఁడు. అట్లు గ్రహింపనిచో భావము వచ్చునుగాని పద్యశోభ విధ్వస్తము కాకతీరదు.

శ్లో॥ ఆసీ దాసీమభూమీవలయమలయజాలేపనేపథ్యకీర్తిః
సప్తాకూపారపారీసదనజనఘనోద్గీతచాపప్రతాపః
వీరా దస్మాత్పరః కః పదయుగయుగపత్ప్రాతిభూపాతిభూయ
శ్చూడారత్నోడుపత్నీకరపరిచరణామందనందన్నఖేందుః

(12-18)

స్రగ్ధర:—ఆలోకాలోకమేదిన్యమలమలయజోదారవిస్ఫారకీర్తిన్
ఖేలాకూపారపారాఖిలజనవినుతాక్షీణచాపప్రతాపున్
బాలా! వీక్షింపు మీనిం బదయుగయుగపత్ప్రాతిభూపాతిభూయ
శ్చూళారత్నోడుపత్నీసులభపరిచయాస్తోకనందన్నఖేందుః

(5-120)

ఇట్లు యతిప్రాసాదులకొఱకుఁ జేయు స్వల్పములగు మార్పులతో 'శబ్దం బనుసరించుట' పలుతావులందుఁ గననగును.

మూలము నందలి యేచిన్న సమాసమునో పదమునో యాధారముగాఁ గొని స్వీయసమాసనైపుణ్యమును శ్రీనాథుఁడు కొన్నియెడలఁ బ్రకటించుచుండును.

"నలప్రణాలీమిళదంబుజాక్షీ సంవాద పీయూషపిపాసవ స్తే" (6-3)
మ॥ నలనాళీకమృణాలనాళలతికానవ్యప్రణాళీమిళ
ల్లలనాలాపకథాసుధానుభవలీలాలోలచేతస్కులై (3-78)
"శకోర్మిర్మికిర్మీరితధర్మలిప్సుః (6-97)
మ॥ శరోర్మిర్మికిర్మీరని, ర్మలధర్మాగమమర్మసర్మ
సఖసమ్యక్కర్మకాండంబులన్ (3-132)
"అసింధవత్యాః క్షతకాసవాసురం" (16-18)
ఉ॥ అ,క్కానసరక్తబీజమధుకైటభశుంభనిశుంభచండముం
డాసురకంఠఖండనవిహారమహోగ్రము మండలాగ్రముల్.

ఆంధ్రీకృతపద్యములందు సైత మమూలకసమాససంధానము చేయు చుండుటయుఁ గలదు. 6-77, 78, 86 శ్లోకముల కాంధ్రీకరణముగా వెలయుచున్న 3-120 పద్యము నందలి యీ భాగ మమూలకము.

సీ॥ అవధారు దేవి! దివ్యకిరీటకోటిసం
దానితవికచమందారదామ
సందోహమకరందబిందుధారాధౌత
సందీప్తచరణారవిందుఁడైన (4-120)

ఈ సమాసమును గొంచెము మార్పుతోఁ గాశీఖండమున గ్రహించి నాఁడు. (కాశీ 4-163)

శబ్దానుసరణము పద్యములందే కాక వచనభాగములందు సైతము విస్తరించియున్నది.

"వాగ్జన్మవైఫల్య మసహ్యశల్యం
గుణాఢ్యభూతే వస్తుని మౌనితా చేత్" (8-32)

వ॥ గుణాఢ్యభూతంబైన పదార్థంబు వర్ణింపకునికి యసహ్యశల్యంబైన వాగ్జన్మ వైఫల్యంబు (4-12)

"తేషాం రుచ శ్చారతరేణ చిత్తం
పంచేషుణా లుంఠితధైర్యవిత్తమ్" (8-59)

వ॥ పంచేషుపరిలుంఠిత ధైర్యవిత్తంబులగు తమచిత్తంబులంగల (4-19)

శ్రీనాథుఁడు మూలమునందలి యమకాదినియమములను దీసి వైచుట కలదు. (3-61, 7-114 మొ॥) ఇంతియకాక యమూలకములగు యమకాదినియమములనుగూడ ననుసంధించుచు నాంధ్రీకరించి నాఁడు.

1. కొండని వేడ్కతోఁ బసిఁడికొండ (1-53)
2. అంచితాయామవతులలయ్యే యామవతులు (1-75)

3. కలికమ్యుతిఖంజనుయ్యో ఖంజనకులమ్ముగ (2_12). 'అపిఖంజన మంజనాంచితే' (2_23) అని మూలము. "ఖంజఃకథమ్" (నైష 5-136) అనుచోటి ఖంజశబ్దము నిట ననుసంధించి యుండును. (శృ.నై 3-72).
4. రాకసుధాంశుమండలము రాకకు (2_137)
5. వాఁడిహారవేళఁ జెలువా చెలువారెడు నీచనుంగవగ (5-108) ఈపద్యమునందే "సారవ సారవోర్మిజః" (12-7) అనుదాని నాధారముగాఁగొని "సారవ సారవోర్మిభవసారవరాంబు పృష త్కదంబముల్" అని యమకమును బాటించినాఁడు.
6. అనలసంబంధ వాంఛ నా కగునదేని యనలసంబంధ వాంఛ నా కగునుచూవె (2-71)
7. ప,తంగు డంగీకరించుఁ బతంగవృత్తి (5-140)
8. నవశిరీషసుమంబుల నవకమునకు (4-7)
9. భారతీ, భారతీవ్రమైన భాషణముల (7-104). 'భారతీసారతీవ్రయా' అని మూలము (17-133).
10. మానవతీజనతాలలామకుం, గానిక యిచ్చెఁ దానివెలిగానికనత్కనకారవిందముగ (8-33). "కానుకయిచ్చు అను వేదమువారి పాఠము కవిప్రయుక్తము గాదని తలంపనగును. "సిధులు తొమ్మిదియుఁ గంకే కాలునకు నిచ్చు, నిర్మలమణులు కానికలుగాఁగ" (కాశీ. 7-152) అని కాశీఖండమున శ్రీనాథుఁడు 'కానిక' యను పదమును యతి నిబద్ధస్థలఖచితముగఁ బ్రయోగించియున్నాఁడు.
11. నీ కాంతాస్యముం బోలఁగా, వలదా యీ శశికిం గళంకికి మృగవ్యాధోత్తమాంగస్థలీ వలదా కాశధునీతటావనివనీ వాసీరకోయష్టికిన్. (8_195)

12. పల్లవము లేతచిగురు యాకులు (1-60).

'పల్లవంబులు దీని పదకాంతిలవములై, పల్లవశబ్దలాభంబుఁ బొందె' (3-202) అను నాంధ్రీకృతపద్యపాదమునందలి భావమే యిట ననుసంధించియుండును. (నైష. 7-99 శ్లో)

13. క॥ వలభులఁ గలకలవరములఁ
గల కల యనిపలుకఁ గలికికలవింకంబుల్ (7-156)

14. మ॥ కలికాలంబు విదర్భరాజసుతయాగాఘాంకపాళీమహో
త్కలికాలంబునఁడు సంచరించె నిషధక్ష్మామండలిన్ మార్గభూ
వలనిగ్రాహిణియైన పాదపదసైన్యశ్రేణిదర్పోద్ధతిన్
నలనిగ్రాహిణియైన యాత్రకు సముల్లాసంబు సంధిల్లగన్
(7-136).

శ్లో॥ ద్వాపరైక పరీవారః కలిరన్మత్సరమూర్ఛితః
నలనిగ్రాహిణీం యాత్రాం జగ్రాహ గ్రహిలః కిల (17_159)
అనిమాత్రమే మూలము.

ఆంధ్రీకృత పద్యములందుఁ గొన్నిచోట్ల నమూలకపదములను జొప్పించిన నొప్పిదమై యుండును. మఱికొన్నిచోట్ల మూలపదములను గాని భావమునుగాని కొంచెము మార్చినచో సరసార్థప్రతిపాదకముగ నుండును. మూలభావమున కనుకూల మగురీతి నమూలకభావములను గల్పించుటయే రసపాకరమణీయత్వసంపత్సంపాదనసమర్థమై కొన్ని పట్టులందుఁ గన్పట్టును. శ్రీ తిరుపతి వేంకటకవులు శ్రీనివాసవిలాసమున నిట్లు చెప్పియున్నారు.

ఉ॥ ఒక్కెడఁ జక్కనౌ పదము నొక్కటిఁజేర్చిన ముచ్చటౌ మఱిం
కొక్కెడ నున్న దున్నయటులుంచి రచించిన ముచ్చటౌ మఱిం
కొక్కెడ నున్నదాని నగ మించిన మేలగుఁ దెల్పుసేయుచో
మక్కికి మక్కి యన్నటుల మార్చిన కావ్యము శ్రావ్య మెట్లగున్.
(శ్రీనివా)

అధునికాంధ్రీకవిత్వతత్త్వనిర్ణేత లనఁదగు వీరివాక్యములు శిరోధార్యములు. ఈవిషయము విస్పష్టమగుటకుఁ గొన్నిఁటి నుదాహరణములిచటఁ జూపుచున్నాఁడను.

**III.** ఆంధ్రీకృత పద్యములం దమూలకపదసంధానము :—

శ్లో॥ అదాహి యస్తేన దశార్ధబాణః
పురా పురారే ర్నయనాలయేన
స నిర్దహం స్త్వం భవదక్షివాసి
న వైరశుద్ధే రధునాధమర్ణః (8-73)

ఉ॥ స్థాణుని లోచనాంచలము దాపుగఁ దీవ్రతరార్చులన్ నిజ
ప్రాణముఁ గొన్ననాఁటి పగ యాత్మఁదలంచియొ నీకటాక్షదృ
క్కోణము ప్రాపుగన్ మరుఁడు గోల్కొని పంతమెలర్పఁగాఁ గొనెన్
బాణదశార్ధపాతమునఁ బావకు భూరిమనోభిమానమున్. (4-31)

'తీవ్రతరార్చులన్' 'పావకు భూరిమనోభిమానమున్' అనునవి యమూలకములు. పావకుఁడు సప్తార్చి కావున నేడు జిహ్వాలతోఁ బెట్టిన పాటుకన్న నైదుబాణములచేతనే యెక్కువ బాధించుట పంతమెలర్పఁగాఁ గొనుట. అతఁడు ప్రాణమును హరించఁగాఁ దాను మనోభిమానమునే హరించుట మదనుఁడు తీర్చికొనిన పంతమునకుఁ బరమావధి.

శ్లో॥ ప్రాణా నపి పరిత్యజ్య మాన మేవాభిరక్షతు
ప్రాణా స్తరంగచపలా మాన మాచంద్రతారకమ్
(శ్రీవేదమువారి వ్యాఖ్య)

"అథాప్య రాగస్య దధౌ పదే పదే
వచాంసి హంసీవ విదర్భజా దదే (9-14).
రాజహంసియుఁ బోలె రమణీలలామంబు
వచనములం దనురాగ మొదయమొంద

సమమోచితంబుగా సారస్య మొప్పారఁ
బలికె నిట్లని మహీపాలుతోడ (4-59).

'సమమోచితంబుగా సారస్య మొప్పార' ననుటలోని స్వారస్య మమూలకమే.

IV. మూలపదాదులను గొంచెము మార్చుటచే నరసార్థప్రతిపాదనము:-

శ్లో॥ అనేన సార్ధం తవ యౌవనేన
కోటిం పరామచ్ఛికురో ఽధ్యరోహాత్
ప్రేమాపి తన్వి త్వయి వాసవస్య
గుణోఽపి చాపే సుమనః శరస్య (8-61).

గీ॥ పరమమగు కోటికెక్కెనో పద్మనయన
నవనవంబైన నీ జవ్వనంబుతోన
నసమబాణుని చాపంబునందు గుణము
భామ నీయందు సుత్రాము ప్రేమగుణము (4-21).

నవనవమైన దమయంతీయౌవనముతో మన్మథునిచాపంబునందు గుణము పరమమగు కోటికెక్కెనది. కోటిమడుంగులాధిక్యమును సంపాదించినది. (వేదము వారిటీక) మూలములో 'సుమనఃశరస్య' అని కలదు. ఆంధ్రీకరణమున నసమబాణుఁడని కలదు. 'సుమనఃశరస్య' అనుదానిని యథాతథముగా నాంధ్రీకరింపఁ దలఁచినచో "అలరు విల్తునిచాపంబునందు గుణము" అనురీతి నాంధ్రీకరింపనగును. 'అసమబాణుఁడనఁగా నిరుపమానము లగు బాణములు కలవాఁడు. అట్టివానికి నవనవంబైన దమయంతీ యౌవనపుఁ బ్రాపు లభించిన నింకఁ జెప్పవలసిన దేమి? అతని చాపమున గుణము కోటికెక్కుట, కోటిమడుంగు లెక్కుట తథ్యము. "లలనా, లసమానదృష్టిజాతము, లసమాంబకు చిత్రశరములై విలసిల్లె" అను వసుచరిత్ర పద్యపాదము లందలి 'యసమాం

బక' శబ్దమువలె నిచ్చటి 'యసమబాణ'శబ్దము సరసము. వసుచరిత్ర విమర్శనానుబంధమున నసమాంబక పదమున కిట్టి స్వారస్యమే చెప్పఁబడి యున్నది.

"పరాపరార్ధై ర్నిదధాతి భానౌ
రుషారుణం లోచనబృంద మింద్రః (8-62).

జం, భారినిగుడ్చు భ్రాంతి నుదయావసరంబులయొద్దనుండి రో
షారుణమైన లోచనసహస్రము బాలసహస్రభానుపై (4-22)

లోచన సహస్రము బాలసహస్రభానుపై నిగుడ్చుననుటచే నొక్కొక్క కిరణముపై నొక్కొక్క నేత్రమని స్వారస్యము. రెండు కన్నులు గల వానికన్న వేయికన్నులు గలవానికి విరహము 500 రెట్లధికమని వేఱొక సారస్యము (వేదమువారివ్యాఖ్య) భానౌ=బాలసహస్ర భానుపై, లోచనబృందమ్=లోచనసహస్రమునను చిన్ని మార్పులతో సరసార్థములు ప్రతిపాదింపబడినవి.

"......సురద్రుమ పంచకకోమలప్రవా,
ళావలిసేకరాంఘ్రియుగళాధరపల్లవరాగలక్ష్మిచే
భావనఁ జేయుఁ బో మథనపర్వతము" (5-64).

కరాంఘ్రియుగళాధరములు మొత్తమైదు. ఈ యైదింటితో 'సురద్రుమపంచకకోమలప్రవాళావలిని' భావనసేయుట సరసముగనున్నది. "పాణిద్వయేన దివిషద్ద్రుమపల్లవాని" (11-63) అని మూలమునఁ బాణిద్వయము మాత్రమె చెప్పఁబడెను.

V. మూలానుకూలమగు సమూలక పాదకల్పనము :—

శ్లో॥ శ్రియాస్యయోగ్యాహ మితి స్వమీక్షితం
కరే త మాలోక్య సురూపయా ధృతః
విహాయ భైమీ మపదర్పయా కయా
న దర్పణః శ్వాసమలీమసః కృతః (1-21).

సీ॥ కేళీలీలాగేహ కుడ్యభాగంబుల
వ్రాయుదు రమ్మహీశ్వరుని మూర్తి

గీ॥ రాజకన్యలు జగతి నాకభ్రమమునందుఁ
గందువారల నిట్టూర్పుగాడ్పు వేఁడి
ముకురములు చారుమోహనమూర్తి యనఁగఁ
బరగు దమయంతి చేతిదర్పణము దక్క (1-70).

ఆంధ్రీకృత గీతపద్యము ననుసరించి నాలుగు పెద్దపాదములు కల్పింపఁ బడినవి. రాజకన్యల మనోభావములతోపాటు నలుని యసాధారణ సౌందర్యమునతనికి దమయంతియే యనురూప యన్నవిషయము పరి పుష్ట మగుచున్నది. విస్తరభీతి బద్యము నంతయు వ్రాయలేదు.

"...కించిత్తం దత్తతుష్టయ మదాతరి హార్థివియా
దత్వా సర్వం ధనం ముగ్ధో బంధనం లబ్ధవా౯ బలిః (17-81)

సీ॥ దినవాథనందనుఁ దిత్తొల్చి విడిచిరి
కరుణలేకొముక లేరిరి దధీచిఁ
బాతాళబిలమున బలిఁ గట్టిపైచిరి
జీమూతవాహను జీవి హాపి
కత్తి పాల్గొనిరి శిబీంద్రు నంతటివానిఁ
గలగుండు వెట్టిరి కలశవార్ధిఁ
దివుటఁ జుక్కలజేని దినగోరు మొసఁగిరి
పండు దుల్చిరి కల్పపాదంబు

(సశేషము)

# ఛందోదర్పణము - కొన్ని విశేషములు

శ్రీ భట్టాచార్య

'క్వచిన్నైన'-కొన్ని యెడల నేకపదమునందు లఘువు కాదు. వటుప్రవ, కదుప్రవ మొదలైనవి. 'నరేఫయో' రేఫద్వయసంయోగము పర మగుచుండ పూర్వాక్షరము లఘువు కాదు. మఱ్ఱి, వెఱ్ఱి, అఱ్ఱు మొదలైనవి.

గురులఘుస్వరూప మిట్లుండఁగా ననంతుఁడు దానికి విరుద్ధముగా "సంయుక్తాక్షరము పరముగా నున్నపుడు ఆంధ్రపదాంత్యవర్ణము ఊఁదఁబడుట, ఊఁదఁబడకపోవుట అవసరమును బట్టియుండు నని చెప్పి- "జానకీవల్లభుఁడు క్షమాశాలి" అనునది ఊఁదఁబడనిదానికిని, "దశరథాత్మజుఁడు స్వామి ధాత్రికి" అనునది ఊఁదునట్టిదానికిని యుదాహరణములుగా నిచ్చియున్నాఁడు. దీనినిబట్టిచూడ నవసరమైనచోట సంయుక్తాక్షరము పరమైన పూర్వపదాంధ్రవర్ణము గురువు కావచ్చును, కాకపోవచ్చును- అనునది యనంతుని మతమైనట్లు కనఁబడుచున్నది. కాని పూర్వాంధ్రకవిప్రయోగములు మృగ్యములు.

## యతి ప్రకరణము

### 15 ఛందోదర్పణమునందలి 24 యతుల భేదములు

కం. స్వరయతులు, వర్గయతులును
సరసయతుల్ ప్రకట మైన సంయుక్తయతుల్
పొరిఁ బ్రత్యేకయతులు ననఁ
బరఁగును యతిపంచకంబు పంకజనాభా !

ఛందో. ప్ర. ఆ. ప. 78

అనంతుఁడు యతులయందలి భేదములఁబట్టి యయిదువిధములుగా విభజించియున్నాఁడు.

1 స్వరయతులు 2 వర్గయతులు 3 సరసయతులు 4 సంయుక్త యతులు 5 ప్రత్యేకయతులు- ఈ యయిదువిధములను మరల నిట్లు విభాగించియున్నాఁడు.

కం. స్వరయతులు ప్రాది కాకు
స్వర నిత్యసమాసయతులు వర్గయతులు ని
ద్ధర పోలికవడి సంయుత
విరతి యనుస్వారయతులు వెలయు ముకుందా!

కం. ప్రభునామాంత విరతి యన
విభాగవిరమణమును భిన్నవిశ్రమమును గా
స్తుభధర ! వికల్పయతి యన
నభేద విరమణ మనంగ నైదు తెఱంగుల్.

ఛందో. ప్ర. ఆ. ప. 79-80

"భీమన ఏది చెప్పె ననంతామాత్యుఁడు సేసె వెనుక యతు లిరువదినాల్గు" అని యప్పకవి తన యప్పకవీయమునందుఁ జెప్పి యున్నాఁడు. దీనినిబట్టి యనంతుఁడు తనఛందోదర్పణమునందు 24 యతులు చెప్పినట్లు తెలియుచున్నది. కాని యనంతుని వివరణపద్యము లందు 24 యతిభేదములు కనిపించుటలేదు. లక్షణలక్ష్యములను జూడ 24 యతులు కనిపించుచున్నవి. ద్వితీయముద్రణఛందోదర్పణము నందుఁ గొన్నిపద్యములపై శీర్షిక లుంచఁబడినవి. కొన్నిటిపై నుంచఁ బడలేదు. అనంతుఁడు చెప్పిన 24 యతులను జూపుచుంటిమి. పరి కింపుఁడు—

1 స్వరయతులు 2 గూఢస్వరయతి 3 ఋకారస్వరూపయతి 4 రీవిరమము 5 ఇవడి 6 ప్రాదియతి 7 కాకుస్వరయతి 8 నిత్య సమాసయతి 9 నిత్యయతి 10 వర్గయతి 11 పోలికవడి 12 సరస యతి 13 సంయుక్తయతి 14 అనుస్వారయతి 15 తద్భవవ్యాజయతి

16 రేఫయుతయతి 17 మకారయతి 18 ప్రభునామాంతవిరతి 19 విభాగయతి 20 భిన్నయతి 21 వికల్పయతి 22 అభేదయతి 23 యుక్తవికల్పయతి 24 ఎక్కటియతి– ఈ యిరువదినాలుగుయతులను అనంతుఁ డిచ్చిన లక్షణలక్ష్యములఁబట్టి గ్రహింపఁబడినవి. శీర్షికలులేని విందు పొందుపఱచుచుంటిమి. చూడుఁడు–

| | | | | |
|---|---|---|---|---|
| ప్ర. ఆ. | | 87వ | పద్యమునకు | రేవిరమము |
| ,, | ,, | 89 | ,, | ఇవడి |
| ,, | ,, | 93 | ,, | ప్రాదియతి |
| ,, | ,, | 102 | ,, | నిత్యయతి |
| ,, | ,, | 112 | ,, | తద్భవవ్యాజయతి |
| ,, | ,, | 119 | ,, | ప్రభునామాంతవిరతి |
| ,, | ,, | 120 | ,, | విభాగయతి |
| ,, | ,, | 121 | ,, | భిన్నయతి |
| ,, | ,, | 125 | ,, | అభేదయతి |

శ్రీ గిడుగు వెంకటసీతాపతిగారు కవిజనాశ్రయము, కావ్యాలంకారచూడామణి, ఛందోదర్పణము, అప్పకవీయములందలి యతిభేదముల నొకపట్టికగా నిచ్చుచు ఛందోదర్పణమునందు రేఫయుతయతి వదలి 'దియతి'ని గ్రహించిరి. కాని యనంతుఁడు "రేఫయుతయతి" యని చెప్పి 'దియతి' యని ప్రత్యేకముగాఁ జెప్పక భిన్నయతిభేదముగాఁ జూపించియున్నాఁడు. తిలకింపుఁడు–

గీ. ఆంధ్రలిపిఁ జొప్పడదు ఋకారాన్వితంబు
కొత్త కాదు కృష్ణుని వెన్నముచ్చి మనఁగ
సుక్కఁ డతఁ డాజి నెట్టి విరోధినైనఁ
గుమ్మ నన రేఫయుతయతి కూడు గాన.

ఛందో. ప్ర. ఆ. ప. 114

ఆంధ్రభాషలో సనఁగా నచ్చు తెలుఁగులో ఋకారముతోఁ గూడిన పదము లుండవనియు, "మ్రిచ్చిమి, సుర్కు, కుర్మ్రు" వంటి శ్రాివడితోఁగూడినవియే యుండునవనియు, ఆ శ్రావడి యేహల్లుతోఁగూడినను బరస్పరముగా (స్వరసామ్యమున్నపుడు) యతి చెల్లుననియు, అట్టిదానికి "రేఫయుతయతి" అని యనంతుఁడు పేరుపెట్టినాఁడు. ఇట్టిదానిని గ్రహింపక శ్రీ గిడుగువారు-

గీ. ఇట ఇకారాంతపదముమీఁదటి దికార
మది యనంగ నవ్వల భిన్నయతికిఁ జెల్లు
దివిజవిభవంబు శౌరిచేతిది యనంగ
నసురనాశంబు హరిచేతియది యనంగ.

అని భిన్నయతికి భేదముగాఁ జెప్పినదానిని గ్రహించి 'దియతి' అని వ్రాసిరి. అది సరికాదు. 'దియతి' యని పేరుపెట్టుట కెంతవఱకుఁ దగియున్నదో పరికింతము.

"సర్వశబ్దంబులు సంబంధమునందుం దచ్ఛబ్దంబుతోడ సమసించు" (బాల వ్యా. స. ప. సూ. 8 సంస్కృతప్రాకృతసమములు, భవములు, దేశ్యములు అను వివక్షత లేక యెల్లతెలుఁగుశబ్దములకు సంబంధార్థము వివక్షించునపుడు తచ్ఛబ్దముతోడ సమాసము కలుగును. పై సూత్రముచే సమసించిన "అది, అవుల" యత్తులకే "అది, యవి శబ్దముల యత్తునకు వృత్తిని లోపంబు బహుళంబుగా నగు" అను బా. సూ. చే అకారమునకు బహుళముగా లోపము వచ్చి చేతి + అది = చేతిది, చేతియది అని రూపద్వయ మేర్పడును. అకారము లోపించినపుడు అకారముతోఁ జెల్లదనియు, లోపింపనియపుడు చెల్లుననియు, అట్టిదానిని భిన్నయతిభేదములోనే చెప్పినాఁ డనంతుఁడు. కాని దానికి 'దియతి' యని పేరుపెట్టినట్లు లేదు. "చేతి + అది" అనుదానిలోని అకారము లోపించినను పూర్వ మచట అకార మున్నది కదా,

అందువలన "చేతిది" యనునపుడుకూడ అకారముతో యతి వేయుదు రనుభావముచే ననంతుఁడు దానిని వివరించి చెప్పినాఁడు. అంతియేకాని అది "దియతి" కాదని మా యభిప్రాయము.

## 16 ఎ ఏ, ఒ ఓ ల విషయము

కం. అలఘుచతుస్సంధ్యక్షర
ములలో నై యౌ లు దక్క మొదలిటి రెంటన్
తెలుఁగునను హ్రస్వదీర్ఘము
లోలయును నె ఏ లనంగ నొ ఓ లనఁగన్.

ఛందో. ప్ర. ఆ. ప. 83

సంధియక్షరములైన ఏ ఐ ఓ ఔ లను నాలుగక్షరములలో ఐ ఔ లు కాక తక్కిన ఏ ఓ లకుఁ దెలుఁగుభాషలో హ్రస్వదీర్ఘములు (ఎ ఏ ఒ ఓ) ఉండును– అని యనంతామాత్యుఁడు చెప్పినాఁడు. పై పద్యమునందలి నాలవపాదమునందు ఎ ఏ ఒ ఓ లని యున్నయెడల గణభంగము తప్పక కలుగుననియు ఏ ఏ ఓ ఓ లని దిద్దుకొన్న దోషము పోవుననియుఁ గొందఱు చెప్పుచుండిరి. చూడుఁడు-

కం. "అలఘుచతుస్సంధ్యక్షర
ములలో నై యౌ లు దక్క మొదలిటి రెంటన్
తెలుఁగునను హ్రస్వదీర్ఘము
లోలయును నె ఏ లనంగ నొ ఓ లనఁగన్."

ఛందో. ప్ర. ఆ. ప. 83

సరిగా ముద్రితపద్య మిట్లే యున్నది. ఇందుఁ జివరిపాద మొక్కటి చర్చనీయము. అందు వక్రములు– పై పద్యభావమునకుఁ దగినరీతిని హ్రస్వములుగను, దీర్ఘములుగను "ఎ ఏ లనంగ, ఒ ఓ లనఁగన్" అని చూపఁబడినది. కాని యీ నాల్గవపాద మిట్లేయున్న

గణభంగము తప్పక కల్గును. ఆ పాదము క్రిందిరీతి నున్న సరిపోవునని మా యాశయము. "ఒలయును నే ఏ లనంగ నో ఓ లనఁగన్" ఏ ఏ ఓ ఓ లని మనము వాడుకలో మొదటిదానికి హ్రస్వోచ్చారణము సేయక దీర్ఘోచ్చారణము నిత్తుము. ఇట్టియెడల కావ్యములందును హ్రస్వములు దీర్ఘములుగా నుపయోగింపఁదగును. ఇవ్విషయము శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులవారు తమ ప్రౌఢవ్యాకరణము నందలి సంజ్ఞాపరిచ్ఛేదమునఁ "గారేఫప్రత్యయములు రానపుడు హ్రస్వములు దీర్ఘము లగును" అనుచు తెలిపినారు. కారప్రత్యయము వచ్చునెడ "అకారమున కుకారము వచ్చును" అని యుండు– కారప్రత్యయము రానితఱి "ఆ కూ వచ్చు" అని యుండును. పైపద్యములోఁ గారప్రత్యయ ముపయోగింపఁబడి "ఎకార మేకారము లనఁగ, నొకార మోకారము లనఁగ" అనునట్లు లేదు కావున "నే ఏ లనంగ నో ఓ లనఁగన్" అని యుండవలయు ననియు నపుడు గణభంగము ఒదవదనియు మా యాశయము" ఆంధ్రసా. ప. పత్రిక సం. 3౯ సంచిక 1-3 అని వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు వ్రాసిరి. ఈవిషయమును బరికింతము.

శ్రీ గోపాలకృష్ణయ్యగారు నాలుగవపాదమునందలి "ఎ ఏ లనంగ, ఒ ఓ లనఁగన్" అనుచోట గణభంగ మున్నదనియు, దానిని ఏ ఏ ఓ ఓ లని దిద్దుకొన్న గణభంగము కాదనియు, ఏ ఏ ఓ ఓ లు అని వాడుకలో మొదటిదానికి హ్రస్వోచ్చారణము సేయక దీర్ఘోచ్చారణము నిత్తురనియు చెప్పిరి. కాని యది సరికాదు. అనంతుఁడు లక్షణమునందు "హ్రస్వదీర్ఘము లొలయును" అని చెప్పి క్రమముగా హ్రస్వమునకు ఎ ఒ లు, దీర్ఘమునకు ఏ ఓ లు ఉదాహరణముగా నిచ్చినాఁడు. మన మా హ్రస్వములుగానున్న ఎ ఒ లను దీర్ఘముగాఁ జేసినయెడల అనంతుఁడు చెప్పిన హ్రస్వముల కుదాహరణములు దొర

కవు. పోనీ యనంతునకు ఎ ఒ లని హ్రస్వములుగాఁ బ్రయోగించిన గణభంగము కలుగునని తెలియదా ? తెలిసియు నేట్లు ప్రయోగించి నాఁడు ? కాని యొకయనంతుఁడే కా దట్లుచెప్పినది; పూర్వలాక్షణిక కవులును నట్లేచెప్పిరి. కూలంకషపాండిత్యప్రజ్ఞాధురంధరులైన భీమన మొదలైన లాక్షణికులకు నట్టిచోటుల గణభంగ మగునని తెలియ దనుట సరికాదు. వారు- అట్టితావులందు గణభంగము కలుగదనియే యట్లు ప్రయోగించిరి. దానిని దీర్ఘముగాఁ జేయవలసిన యవసరము లేదు. లోకమునందు నట్టితావుల హ్రస్వమును దీర్ఘముగాఁ బలుకుదు రనుట వింతగా నున్నది. నాయెఱిఁగినంతవఱకిట్టిది లేదు. అట్టితావుల దీర్ఘముగాఁగాక యూఁదిపలుకునట్టి యాచారము కలదు. ఈ యూఁదు డుచే ఎ ఒ లకు గురుత్వము గలిగి గణభంగమునకుఁ దావులేకుండఁ జేసినది. ఈవిషయమునే శ్రీ గిడుగు వెంకటసీతాపతిగారు ఛందో దర్పణపీఠికలో నిట్లు చెప్పియున్నారు. "తనరఁగ అ ఆ ఇ ఈ లనఁగా ఉ ఊ లు నాఁగ" ఈపద్యమునందు హ్రస్వోచ్చారణములేమైనా అ ఇ ఉ ఋ లు గురువులుగనే యుచ్చరింపవలయును. అది యెట్లుజరుగు నంటే యీ హ్రస్వాక్షరము లుచ్చరించినతరువాత నేకలఘుమాత్ర కాలము ఊపిరి యాఁపి "ఆ" బిగబట్టి పైవర్ణము లుచ్చరించుటచే నీ హ్రస్వాక్షరోచ్చారణలో ద్విమాత్రోచ్చారణప్రయత్నము జరిగి నది." ఇది యెంతయుఁ దగియున్నది. శ్రీ జయంతి రామయ్యపంతులు గారును బైవిషయమునే మఱియొకవిధముగాఁ జెప్పి యనంతుఁడు ప్రయోగించిన ఎ ఒ లనే సమర్థించిరి. కాని గోపాలకృష్ణయ్యగారి వంటి వింతదిద్దుడులకుఁ గడంగలేదు. అనంతుఁ డా యొకపద్యమునే కా దట్లు చెప్పినది. చూడుఁడు-

కం. తనరఁగ అ ఆ ఇ ఈ
 లనఁగా ఉ ఊ లు నాఁగ నంబుజదళలో

చన ఋ ౠ లన ఓ ఔ
లనఁగ వజంతాహ్వయంబు లగు నీ పదియుఁ౯.

ఛందో. ఆ. 4 ప. 109

కవిజనాశ్రియకర్త భీమనయు-

కం. అ ఆ ఐ ఔలకు మఱి
ఇ ఈ లు ఋకారసహిత మె ఏ లకు నౌ
ఉ ఊ ల్తమలో నొడఁబడి
ఒ ఓ లకు వళ్లగు నయోన్నతచరితా!

అ ఇ ఎ ఒ లను హ్రస్వములుగనే ప్రయోగించినాఁడు. "స్థిత స్యగతి శ్చింతనీయా" అనుటననుసరించి మనము చెప్పికొనవలయును గాని యామహాకవులవ్రాతల దిద్దుటకుఁ బూనుకొనుటకు మన మెవరము ? అనంతుని హ్రస్వములను దీర్ఘములుగాఁ జేయుటకు బహుజనపల్లి సీతారామాచార్యులవారి ప్రౌఢవ్యాకరణములోని "కారేఫ ప్రత్యయములు రానపుడు హ్రస్వములు దీర్ఘము లగును" అను సూత్రము నుల్లేఖించిరి గోపాలకృష్ణయ్యగారు. కాని యందు ఆ ఋ ఊ వచ్చును, కా ఋ గా వచ్చును- అని యేకాక్షరమునే యుదాహరించిరి కాని యందు అనంతుఁడు చెప్పినట్లు జంటలు లేవు. ఒకవేళ జంటలుగా నందు చెప్పినను పూర్వలాక్షణికులు తద్భిన్నముగాఁ బ్రయోగించిరి కనుక నిట్టి విషయములందు ప్రత్యేకసూత్రము చెప్పవలసియున్నది. లక్ష్యమునుబట్టి లక్షణము గాని లక్షణమునుబట్టి లక్ష్యమును మార్పుచేసికొందురా ? అందువలనఁ గవిజనాశ్రియకర్త, ఛందోదర్పణకర్తల వ్రాతలందు గణభంగములు లేవని మా యాశయము.

(సశేషము)

# ప్రాచీనకాలశిల్పచిత్రలేఖనములు

శ్రీ విశ్వనాథ నరసింహం, యం. ఏ. బి. ఇడి.,

## వైదిక ద్రావి డార్యయుగములు

అయినను సామాన్యముగా నాతనిస్వరూపము పానవట్టము నందలి లింగాకారమునే గుర్తించి యసంఖ్యాకు లర్చించుచున్నారు. పార్వతీదుర్గాద్యనేకనామముల శివునిసహధర్మిణి యొప్పారును. ఆమె యాకృతుల నొకటి ప్రసన్నమును వేఱొండు భయంకరము నై యుండును. గణాధ్యక్షుఁ డనఁబడు దేవుఁ డామెతనూజుఁడు. అతనికి గజాననము గలదు. మూషక మాతని వాహనము. అర్చనలయందుఁ దొలిపూజ నందువాఁ డతఁడు. మఱియుఁ గుమారస్వామినాఁబడు కార్తికేయుఁడు పార్వతీపరమేశ్వరుల కుద్భవించి సర్వసుపర్వసేనానాయకుఁడుగా నెన్నికఁ గన్నవాఁడు. సుబ్రహ్మణ్యాద్యనేకనామముల భక్తు లాతని నారాధింతురు. విష్ణువునాఁబడు ప్రసిద్ధదేవుని శంఖచక్రాద్యాయుధంబులు నాలుగుచేతుల ధరించినవానిగా, సమస్తప్రపంచస్థితికిని గారణభూతునిగా, శ్రీభూదేవుల భర్తగా నెన్నుచు నాతని రూపకల్పనఁ జేయుచు నాతని కీభూమియంతయు సింహాసన మనియు నాకాశ మతని నాచ్ఛాదించు ఛత్ర మనియు దేవతానీకము లెల్ల రాతని భృత్యు లనియుఁ బరమామ్నాయములెల్ల నాతని స్తుతించు వందిగణంబు లనియు బ్రహ్మాండ మాతని యాకార మనియు శ్రీదేవి యాతని భార్యామణి యనియు బ్రహ్మదేవుఁ డాతని సుతుఁ డనియు నిత్యాదిగా నాతని సుగుణాత్మకరూపకల్పనము చేయఁబడినది. అట్టి యాదర్శములనే మనసులం దిడికొని శిల్పచిత్రకారులు వారి కళారచనలు సాగించి రని తెలియును.

మఱియు విష్ణుశక్తి యనఁబడు లక్ష్మి శ్రీదేవి యనఁ బరఁగుచు సౌందర్యమూర్తియై యుండెను. ఆమె కామదేవుని పుత్త్రునిగాఁ గాంచెను. రంభాదులెల్ల రామెపరిచారికలు. "నమస్తేఽస్తు మహామాయే, శ్రీపీఠే సురపూజితే, శంఖచక్రగదాహస్తే, మహాలక్ష్మి ర్నమోస్తుతే" అనుశ్లోకమున వివరింపఁబడినట్లు లక్ష్మి కాయాస్వరూప సౌందర్యాదులు గరుడవాహనాదులు నున్నట్లు వర్ణింపఁబడినది. సమస్త సంపదలు నామె కటాక్షమాత్రముననే కలుగునని తరువాతికవులుగూడ నా దేవీమూర్తిని స్తుతించియున్నారు. కొల్లాపురీలక్ష్మిని స్తుతించు సందర్భమున శ్రీనాథకవిసార్వభౌముని యీ పద్యము గమనింపఁదగును.

"కమలనయన నీవు కలచోటు సరసంబు
నీవు లేనిచోటు నీరసంబు
కంబుకంఠి నీవు కలవాఁడు కలవాఁడు
లేనివాఁడు నీవు లేనివాఁడు."

మఱియు నా సేతుహిమాచలపర్యంతము హైందవులచే నారాధింపఁబడు దేవతామూర్తి యవతారము శ్రీరామచంద్రుఁడు. రాముని జననంబాదిగ రాక్షససంహారములు, పరశురామగర్వభంగము, సీతాకల్యాణము, రాముని యరణ్యవాసము, దశముఖసంహారము మున్నగునవి యాతని లీలావినోదములుగా నెన్నఁబడి శిల్పచిత్రకారులచే వివిధగతుల రూపకల్పనంబులఁ బ్రసిద్ధి వహించినవి. మఱియు వేదపురాణేతిహాసోక్తము లగు దేవతామూర్తు లనేకములు శిల్పచిత్రకారులచే రూపకల్పన చేయఁబడినవి.

ఆర్యులు హిందూదేశమునకు రాకపూర్వమే మన దేశమున నివసించు ద్రావిడు లత్యున్నతస్థితి నందిననాగరకతఁ జెందియుండి రని పరిశోధకులు నిరూపించియున్నారు. ఆర్యులు క్రమముగ ద్రావిడ సంస్కృతి నవలంబించిరి. ద్రావిడులు కర్మసిద్ధాంతమును వృద్ధినొందించి

పురాకృత మగు పాపపుణ్యకర్మలు మఱుచటిజన్మమును ఆయావ్యక్తులకు నొసంగ సమర్థంబు లగు నని వెలువరించిరి. మఱియు వారు పరిశ్రమలకు సంబంధించిన పనులను వృద్ధిపఱచి దేవతావిగ్రహములఁ గూడ ననుసరించియుండవచ్చు నని తెలియుచున్నది. లౌకిక వైదిక సంప్రదాయముల ననుసరించినకట్టడముల వారు కఱ్ఱతోను ఱాతితోను గూడ నిర్మించినట్లు తెలియుచున్నది. అట్టి ద్రావిడసంస్కృతి నాకళించుకొని యార్యులు వారి నూతనసంస్కృతులతో ననువుపఱచిరి. వారి నూతనసంస్కారమునందు 'పరబ్రహ్మ'స్వరూప మొక్కటియే యనియు దానినే పలువురు వివిధనామముల వ్యవహరింతురనియు వ్యక్తపఱచిరి. ఆర్యులు హిందూదేశమునందుఁ బ్రవేశించునపుడు వారికి కొయ్యపనులు గృహనిర్మాణవిద్యలు కఱ్ఱతో రథములఁ జేయుటయుఁ దెలియును. మఱియు లోహపాత్రాదుల నిర్మించుటయు, ఇనుము రాగి మున్నగువానితో గృహోపకరణనిర్మాణము నెఱింగియుండిరి. విగ్రహనిర్మాణము వా రొనర్చిరనుటకు ప్రమాణములు లేవు. ఆరంభదశలో వారి కళాచాతుర్యము భూషణములకు సంబంధించినట్లును వారు స్వర్ణాలంకారముల నుపయోగించినట్లును మనకుఁ దెలియుచున్నది. అందుచే వేదాదులలో నిర్వచింపఁబడిన సౌందర్యోపాసనమున కార్యులకళాసృష్టి మిగుల సన్నిహితముగా నున్నట్లు తోఁచును. ఋగ్వేదమునఁ బెక్కుమాఱులు వాడఁబడిన శ్రీకారము ప్రకాశముగను కాంతిగను శోభగను ధనపరముగను దిగ్విజయసూచకముగను అభ్యుదయకరముగను సువ్యక్త మగుచున్నది. కావ్యకర్తల యాదర్శముకూడ నిట్టిదియే. కావ్యసృష్టిని చక్కఁగా తయారుచేయఁబడిన రథముతోఁగాని సుందరతరముగా నేయఁబడిన దుకూలములతోఁగాని భూషణభూషితాంగియై వరునికై వేచియున్న వాసవసజ్జికతోఁగాని యుపమించుటలోఁ గలయభిప్రాయము సౌందర్యోపాసనయే యగును.

క్రమముగా ఋగ్వేదకాలమునుండి యుపనిషత్కాలములోఁగా నార్యసంస్కృతి ద్రావిడనాగరకతతో సమ్మిశ్రితమై హైందవనాగరకత కంతటికిని మూలమైనది. కళాతత్త్వదృక్పథంబులసమ్మేళనముగాఁ గనిపించు నుపనిషత్సూక్తులలో హృదయావిష్కరణ మంతసులభసాధ్యము కాదు. అందలి సామాన్యభావములలో ఈ మిథ్యాప్రపంచమునుండి నన్ను వాస్తవపరబ్రహ్మసాన్నిధ్యమునకుఁ గొనిపొమ్మనుటయు, అజ్ఞానాంధకారవిసరంబునుండి విజ్ఞానభానూదయతేజఃపుంజములలోనికిఁ దోడ్కొనిపొమ్మనుటయు, జరామరణభీతినుండి యమర్త్యత్వమును నిత్యయౌవనమును ప్రసాదింపు మనుటయు ప్రార్థనాదుల ముఖ్యవిషయములు. ఉపనిషత్కాలమున కళలు వృద్ధిలో నున్నట్లును రాగి ఇనుములే కాక తగరము, సీసము, వెండియును వాడుకలో నుండిన రీతులును నూలువస్త్రములు, పట్టుబట్టలు, ఉన్నితో నేసిన యుడుపులును వాడుకలో నుండినట్లు తెలియును. అంతస్తులుగల మేడలే కాక ఇటుకలతోఁ గట్టఁబడిన యిండ్లును వెండి బంగారుపాత్రలును ఇనుపకత్తులును సూదులునుగూడ వాడుకలో నుండెను. అద్దములు, ఆసనములు, సింహాసనములుగూడ నుండినవని తెలియును. సంగీతవాయిద్యములును ఉష్ణీషములును—రాజసూయయాగములందు రాజులు ధరించు శిరోవేష్టనములు—కిరీటములును స్వర్ణాలంకారములునుగూడ నపుడు వాడుకలో నుండెను. ఒకయోడ యీసందర్భమున వర్ణింపఁబడెను. క్రీ. పూ. ఎనిమిదవశతాబ్దమునందు బ్రాహ్మీభాషలో వ్రాయుట తెలిసియుండినట్లు బ్రాహ్మీలిపి వాడఁబడినటు లెఱుంగనగును. మఱియు నాఁ కాలమున నొకదిగంబరస్త్రీవిగ్రహ ముబ్బెత్తుగానున్న బంగరుఫలకముపై నున్నట్లు కనుఁగొనఁబడినందున సుందరము లగువిగ్రహములఁ బ్రార్థనాదికములం దుపయోగించుచున్నట్లు వారి శిల్పచిత్రవిద్యల సంస్కారము తేటపడును.

శిల్పనిర్మాణమునకుఁ జెందిన సాధనిర్మాణములు మిక్కిలి ప్రాచీనకాలమునుండి యున్నట్లు నిదర్శనములు కానుపించును. ప్రాచీన పట్టణశిథిలములు సింధునదిలోయలలోనివి క్రీ. పూ. మూఁడువేలసంవత్సరములనాఁటి వని నిర్ధారింపఁబడినవి. సింధులోయలోని 'మొహాంజదారో' పంజాబులోని 'హారప్పా' శిథిలములు ఆకాలమున శాస్త్రీయమగు కట్టడము లున్నట్లు తెలుపుచున్నవి. వెడల్పయిన రాజమార్గములును సన్నని త్రోవలునుగూడ అంగళ్లతోను సాలలతోను నలరారుచుండినవి. నాఁటి గృహములలోఁ గొన్ని రెండతస్తులు గల్గి యందు మీఁదియంతస్తు కఱ్ఱపనితోఁ జేయఁబడినట్లు తెలియును. ప్రతిగృహంబునకు నొక్కొక్క బచ్చలిల్లు (Bath Room) వీథివైపు నానుకొని యుండుట అందలినీరు వీథివైపు సుళువుగా పాఱుటకని తెలియుచున్నది. వీథులలో నీరు నిలువకపోవుటకుఁ దగినపిల్లకాలువలును పెద్దకాలువలునుగూడ ఇటుకలతోఁ గట్టఁబడినట్లు తెలియుచున్నది. హారప్పాలో నొకకట్టడమునకు పండ్రెండు సమానాంతరకుడ్యనిర్మాణములు కాన్పించుచున్నవి. దాని ప్రయోజన మేమియో వ్యక్తముకాలేదు కాని యది యొక పెద్దనిల్వకొట్టుగా నుండియుండును. మొహాంజదారోలోని కొన్నికట్టడములు వీథిమూలలయందు గిన్నెలయాకారమున నున్నవి. అచటనున్న ముఖ్యమగుకట్టడములలో నొక పెద్ద స్నానఘట్ట మొకటి కాల్చినయిటుకలతో నిర్మింపఁబడుటయేకాక యిరువంకల సోపానములు గల్గిన ప్రవేశమార్గము లున్నవి. ఈ స్నానఘట్టమునకు సహకారములుగా మఱియెనిమిది చిన్నస్నానఘట్టములు ప్రవేశమార్గసోపానములతో నున్నవి. ఇందువలన మొహాంజదారో నివాసులు స్నానమొనర్చుట యొకమతసంప్రదాయముగా ననుసరించుచుండిరని యూహింపవగును.

## బౌద్ధయుగము

హిందువులు బుద్ధుని శ్రీమహావిష్ణువునవతారముగాఁ బరిగణింతురు. సర్వార్థసిద్ధుఁ డనఁబరఁగు నాతఁడు రాజోచితభూషణాదులఁ బరిత్యజించి వల్కలధారియై తప మాచరించి జ్ఞానోదయ మంది బుద్ధుఁ డనఁబడెను. యాగాదులఁ బశువిశంసనము ఖండించి సమస్తప్రాణికోటులందు దయఁ గల్గియుండవలె ననియు నహింసయే పరమధర్మ మనియు గురుజనభక్తి మున్నగుసూత్రముల సులభగ్రాహ్యముగా నెల్లరకును హితోపదేశ మొనరించిన బుద్ధభగవానునిశిష్యులు లెక్కకు మిక్కిలిగా బయల్వెడలిరి. బౌద్ధమతప్రచార మాసేతుశీతాచలమును వ్యాపించుటయేకాక సింహళము, జపాను, చీనా మున్నగుదేశములందును వ్యాప్తమయ్యెను. నాఁటిరాజులును రాజాధిరాజులునుగూడ బౌద్ధమత మవలంబించిరి. పరోపకారాద్యనేకములగు సుగుణములు ప్రజలలో వ్యాపించి ప్రజానీకములు విజ్ఞానులై ప్రవర్తింపఁదొడంగిరి. అత్తఱి లలితకళలు వృద్ధినొందుటలో నాశ్చర్యములేదు.

అప్పటి లలితకళలన్నిటిలో శిల్పచిత్రలేఖనములు హెచ్చుగా నభివృద్ధిఁ జెందినట్లు నేపాళము, టిబెట్టు, బర్మా, సయామము, చీనా, జపానుదేశమునందును ఆర్యావర్తమునందునుగూడ దృశ్యములగు నిదర్శనములవలన ఘంటాఘోషముగాఁ జెప్పవచ్చును. ఆకాలము నాఁటి ప్రతిమాస్వరూపములును చిత్తరువులును విశేషముగా బౌద్ధుల తదీయమతసంప్రదాయములకుఁ జెందినవగుటచే వానికి బౌద్ధమత విజృంభణమే కారణముగా నెఱుంగనగును. బౌద్ధమత మేయేదేశములఁ బ్రబలమయ్యెనో ఆయాచోటులఁ గళావిశారదు లగుశిల్పులును చిత్రకారులును నివసించియుండిరి. మతప్రచారమునకుఁ జిత్తరువులు మిగుల నుపయోగించుటచే బౌద్ధమతప్రచారము నందినకాలములో నాయాదేశములలో శిలాప్రతిమలును చిత్తరువులునుగూడ మిక్కిలి

వృద్ధినొందె నని నిశ్చయింపవగును. ధనాశాతత్పరులు గాక మతావేశ ముతోఁ గూడి నిశ్చలధ్యాననిమగ్ను లగు బౌద్ధసన్యాసు లెల్లెడల తమ చిత్రలేఖనవిద్యల వ్యాపింపఁజేయుచు కుడ్యచిత్రములుమున్నగువానిని మతప్రచారముకొఱకు లిఖించుచుండిరి. అందుచే నప్పటికళావిన్యాస ములలోఁ గళారహస్యంబులు గానిపించును. దేవతారాధనమునకు తక్కుటివేమియు సాటిరానివగుటచే నాఁటిభావౌన్నత్యము చిత్రకళా విశిష్టతయును తరువాత భారతీయచిత్రముల నుండ నేరదు.

మఱియు బుద్ధునియవతారము పాశ్చాత్యులలోఁగూడ నుత్సా హూద్రేకములఁ గల్గఁజేసినదనుట యేతద్విషయవైశిష్ట్యమున కెంతయు హేతుభూత మగును. సర్. ఎడ్విన్. ఆర్నాల్డు అనుకవీం ద్రుఁడు ఆంగ్లమున The Light of Asia అను శీర్షికగల పద్యకావ్యము నందు బుద్ధునిజననాదికజీవితవిశేషములను ఆమహాత్ముని జ్ఞానోదయ తత్త్వవిచారణంబులును తదీయమతప్రచారమునుగూర్చి విపులీకరిం చెను. ఆమతసంబంధమగు ముఖ్యసూత్రములలో ఎట్టిసూక్ష్మజీవినైనను హింసింపరాదనియుఁ, దానప్రతిగ్రహములు స్వేచ్ఛాసక్తులతో నొనర్పఁదగుననియు, సత్యవాక్కులే హృదయపరిశుద్ధి నెఱిఁగించు ననియు, పరదారాగమనాదివ్యసనములు పాపహేతువులగుట విసర్జింప వలెననియు వాకొనఁబడినవి మిగుల సారవంతములు. బుద్ధుని వెనుక నెన్ని మోశతాబ్దములు గతించినపిమ్మట పాశ్చాత్యకళోపాసకులలోఁ గూడ నుత్కృష్టకావ్యకల్పనకు హేతుభూతము లయినవిషయములు తదీయయుగమునం దెందఱో శిల్పచిత్రకారులు తమజీవితము లాయా శిల్పచిత్రనిర్మాణములకొఱకు వినియోగించుటలో నాశ్చర్య మేమున్నది.

కాలప్రవాహమున నంతరింపక మతద్వేషుల కంటఁబడక నిల్చి యున్న అజంతాగుహాలలోని శిల్పచిత్రలేఖనములవలనను సాంచీ స్తూపమువలనను బౌద్ధుల యద్వితీయశిల్పచిత్రకళాచాతుర్యము మనకు

విశదమగును. కొంతకొంత నశించినను అజంతాగుహాలందును సింహ ళమునందలి సిగీరియాయందును గలచిత్రములు చూపఱ నాశ్చర్యచకి తులఁ జేయును. ఫాహియాను, హియాన్ సాంగు మున్నగుబౌద్ధ యాత్రికులు భారతదేశపర్యటన మొనరించి శిల్పనిర్మాణములను చిత్త రువులను దర్శించి యద్భుతమందిరి. బుద్ధభగవానుఁడు శ్వేతదంతా వళముపై నధిరోహించి జనని మాయాదేవిగర్భమునఁ బ్రవేశించిన ట్లొకచిత్తరువు కపిలవస్తుపురమున నుండె నని 'ఫాహియాను' రచించెను. క్రీ. పూ. నాల్గవశతాబ్దమునందు పాళీభాషలో వ్రాయఁబడిన 'వినయ పిటక' మను బౌద్ధగ్రంథమునందు రాజులచిత్రశాలలు పెక్కుచిత్తరు వులతో నలంకరింపఁబడినట్లు తెలియుచున్నది. ఇందువలనఁ జిత్రలేఖ నము సామాన్యముగా నభ్యసింపఁబడినకళ యని తెలియును.

## అజంతాగుహాలలోని శిల్పచిత్రరచనలు

ప్రపంచసుఖముల విడనాడి సన్న్యాసాశ్రమమును యథావిధిగా గురూపదేశమున స్వీకరించినవారు అరణ్యనివాస మొనర్చుచు నిశ్చల జ్ఞాననిమగ్నులగుచుండుట సంప్రదాయ మగును. అయినను బౌద్ధ మతవ్యాప్తికొఱకు బుద్ధభగవానుని యాదేశానుసారముగాఁ దదీయ సిద్ధాంతములను ప్రజాసామాన్యమునకుఁ దెలుపునిమిత్తము బుద్ధభిక్షు కులు జనపదములలో నివసించుచుండిరి. అజంతాగుహాలాకాలములో నిర్మింపఁబడియుండుటచే వారేకాంతవాసముకొఱకు ఆయాగుహలలో నివసించుట పరిపాటియై క్రమముగా నాగుహలు విహారములక్రింద మార్పుఁజెందిన వననగును. బౌద్ధులలోని కళావిశారదులగు శిల్పులును చిత్రకారులును వారి వారి హృద్గతంబులగు భక్తిభావములను శిల్ప చిత్రరచనలమూలముగా వెలిపుచ్చిరి. అందు నృపశిఖామణులచారి త్రములు కొన్ని యున్నవి. యువతీయువకుల సౌందర్యవిశేషములును

(సశేషము)

# ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము-నాడులు

శ్రీ కుందూరి ఈశ్వరదత్తు

## వేంగివిషయము

ఆంధ్రప్రదేశములోని ప్రసిద్ధనాడులలో వేంగినాడొకటి. దీనిని గూర్చి వ్రాయునపుడు నన్నయభట్టు భారతాదిపర్వములోని వేంగి దేశప్రశంస స్ఫురణమునకు వచ్చును.

రాజరాజు కొలువుకూటమును వర్ణించుచు "అఖిల జలధి వేలావలయ వలయిత వసుమతీ వనితా విభూషణంబైన వేఁగీదేశము నకు నాయకరత్నంబునుం బోని రాజమహేంద్రపురంబు నందు" అని నన్నయ రాజమహేంద్రవరము వేఁగిదేశములోని పురవరముగా పేర్కొనియున్నాడు. తదుపరి, ఆదిపర్వములో నర్జునుని తీర్థయాత్రా వర్ణనసందర్భమున మూలములో లేని వేంగిదేశవిభవమునుగూర్చి తన దేశభక్తియు, స్వామిభక్తియు వెలిబుచ్చెనో యనున ట్లీవిధమున వర్ణించియున్నాడు.

సీ. దక్షిణగంగనా దగ్దయునొప్పిన
గోదావరియు జగదాదియైన
భీమేశ్వరంబును బెడఁగగుచున్న శ్రీ
పర్వతంబును జూచి యుర్విలోన
ననఘమై శిష్టాగ్రహారభూయిష్ఠమై
ధరణీసురోత్తమాధ్వరవిధాన
పుణ్యసమృద్ధమై పొలుచు వేఁగీదేశ
విభవంబుఁజూచుచు విభుఁడుదక్షి

తే. ణాంబురాశి తీర్థంబున కరిగి దురిత
హారియైన కావేరీమహాసముద్ర

సంగమంబున భూసురేశ్వరుల కభిమ
తార్థదానంబు లిచ్చి కృతార్థుఁడగుచు.

అదియునుగాక రాజరాజనరేంద్రుని 'వేఁగీవిషయాధీశ, వేఁగీనాథ, వేఁగీభూవల్లభ' యనియు సంబోధించియున్నాడు. వేఁగిదేశమును బేర్కొని వర్ణించిన ప్రథమాంధ్రకవి నన్నయభట్టు. ఇతని తర్వాత వేఁగిదేశమును గూర్చివ్రాసినకవి దశకుమారకృతికర్త కేతనకవి.

దశకుమారచరిత్రమునందుఁ గవి తనుగూర్చి యుదాహరించిన సీసపద్యములోఁ దాను వేఁగివిషయమున వెంటిరాలను నగ్రహారమున కగ్రణి యని వ్రాసికొని యుండెను.

సీ. వేఁగివిషయమున వెణ్ఱి (వెంటి) రాలను పేర
నభిరామమగు నగ్రహారమునకు
అగ్రణి యగువాని నభినవదండినాఁ
బొలుపు మీరినవానిఁ బ్రోలనార్యు
ననుఁగు దమ్ముని సంస్కృతాంధ్రభాషా కావ్య
కర్తృత్వమున నుతిగన్నవానిఁ
గౌండిన్యగోత్రుని బండారు కేత దం
డాధీశుమఱఁది నధ్యయుపరుని
తే. మూలఘటికాన్వవాయసముద్రపూర్ణ
హిమమయూఖుని మారినయ కమలకమల
వదనయగు గంగమాంబకు వరతనూజుఁ
గేతనార్యుని నన్ను విఖ్యాతయశుని.

ఎఱ్ఱాప్రెగ్గడ రచించిన నృసింహపురాణములోఁ దనతాత యొఱపోతసూరి వేఁగినాటఁ గరావర్తి వృత్తిమంతుఁడని వ్రాసియున్నాడు.

సీ. ప్రజ్ఞాపవిత్రుఁ డాపస్తంభసూత్రుండు
శ్రీవత్సగోత్రుఁ డూర్జితచరిత్రుఁ

డగు బొల్లనకుఁ బోలమాంబకు బుత్త్రుండు
వెలనాటిచోడుని వలన మిగుల
మన్ననగన్న భీమనమంత్రి పౌత్త్రుండు
పేరమాంబామనఃప్రియుఁడు
పోతమాంబికావిభు మజ్జనకుని
బొల్లధీనిధికిని బోలనకును

గీ. జన్ననకు ననుజన్మునిఁ గన్నతండ్రి
వేఁగినాటఁ గరాపర్తి వృత్తిమంతుఁ
డనఘుఁ డెఱపోతసూరి కంసారిచరణ
కమలమధుకరపతి సారవిమలయశుఁడు.

కేతనయు, నెల్లాప్రెగ్గడయు నుదాహరించిన వెంటిగాల, కరాపర్తి గ్రామము లెక్కడనున్నవో నిర్ణయుంచుటకు సాధ్యముకాలేదు.

## వేంగి—వేయిగ్రామముల పరిమాణము

ఈ వేంగినాఁడు శాలంకాయన, విష్ణుకుండిన, చాళుక్య, వెలనాటి ప్రభువుల పరిపాలనమునసుండి, వారివారికాలమున నీదేశమును దశశతసకలధరణీతలమనియు, వేంగివేయి, వేంగిపదారువేలనియు, వ్యవహరింపఁబడుచుండెను. విష్ణుకుండి మూడవమాధవవర్మ ఆంధ్రసాహిత్యపరిషచ్ఛాసనములో నియ్యది 'దశశతసకలధరణీతలమనియు, మాధవవర్మ 'దశశతసకలధరణీతలనరపతి' యనియు వర్ణింపబడెను. (క) తర్వాత వేంగివిషయము వృద్ధియై గుణగణవిజయాదిత్యుని కాలములో నియ్యది ద్వాదశసహస్రప్రమాణముకలదని వివరింపఁబడినది. ఈగుణగ విజయాదిత్యుని సాతలూరుశాసనములో నాల్గవ విష్ణువర్ధనుడు ద్వాదశ సహస్రప్రమాణ వేంగిమండలమును బరిపాలించెనని వక్కాణింపఁ

(క) శ్రీ భారతి. ప్రమాదూత సం॥ భాద్రపదమాస సంచిక.

బడినది. "విష్ణువర్ధనః పంచత్రింశద్వర్షాణి ద్వాదశసహస్రప్రమాణే వేంగీమండలమన్వపాలయత్" (చ) అని నాల్గవవిష్ణువర్ధనుఁడు పేర్కొనఁబడెను. తర్వాత వేంగిదేశము పండ్రెండువేల గ్రామప్రమాణము నుండి పదియాఱువేలకు పెరిగినట్లు వెలనాటి పృథ్వీశ్వరుని పిఠాపురము శాసనమువల్ల విదితమగుచున్నది. వెలనాటి గొంకరాజు కుమారుఁడైన రాజేంద్రచోడుని పెంచుకొని కులోత్తుంగచాళుక్యచోడుఁడాతని పదునాఱువేల గ్రామములుగల వేఁగిదేశమునకు రాజప్రతినిధిగ నియమించెను. (ట) అది యటుండ గుంటూరుజిల్లాలోని మొనమదల గ్రామములోని మఱియొక శాసనములో 'వెంగ్గిమండాఱువేలకు' నని వెంగియాఱువేల పరిమితిని గూర్చి తెలుపబడినది. (త) ఈ సంఖ్యా పరస్పర విరోధవిధానమున కంతు లేనట్లు భావించవలసియున్నది.

మఱియు కృష్ణామండలములోని శ్రీకాకుళ శాసనములో వెలనాటి రెండవగొంకరాజు వేంగీవిషయ షోడశసహస్రావనీవల్లభుడని చెప్పఁబడెను. (ప) ఈవేయి, పండ్రెండువేలు, పదునాఱువేలు గ్రామ సంఖ్యను దెలుపును. ఈవిషయ మిదివఱకె యితరనాడులనుగూర్చి

---

(చ) (1) ఆంధ్రపరిశోధకమండలివారి పత్రిక. సంపుటము 5-పుటలు 101-116.
(2) భారతి-మొదటిసంపుటము. పుటలు 90-110 (1924).

(ట) ఎపిగ్రాఫియా ఇండికా సంపుటము 4. పుట 32.
"ప్రతిషోడశ సాహస్రం ప్రదదౌ వేంగిమండలం"

(త) దక్షిణహిందూదేశశాసనసంపుటము 4. సంఖ్య 935. శా. శ. 1191.

(ప) దక్షిణహిందూదేశశాసనసంపుటము 4. సంఖ్య 974.
వేంగీవిషయషోడశసహస్రావనీవల్లభ సహకారవల్లభ ఆహవరక్కస
విక్రమకర్కశ.....
......గొంకమహారాజుల తల్లి శ్రీ గుండమాంబికాదేవి.

వ్రాసినపుడు వివరించియున్నాను. (గ) వేఱొకచోట వేంగివిషయము పండ్రెండుపదిమూడవశతాబ్దమునాఁటికి మరల వేంగి-వేయింటికి స్రుక్కెనని శాసనములవల్ల తెలియుచున్నది. వేంగిమండలాధిపుఁడైన అయ్యపరాజు శాసనములో తనముత్తాత గొంకరాజు వేంగీసహస్రక్షమాధీశుడని వ్రాయించెను. (జ)

"జాతో గొంకమహీపతి స్సువిలస ద్వేంగీ సహస్రక్షమాధీశో
విశ్వమపాలయేత్ శృతగుణోయో ధర్మసన్మార్గగైః॥

## వేంగిపురము—వేంగీరాజ్య విస్తీర్ణము

సముద్రగుప్తుని అలహాబాదు శాసనములో ప్రప్రథమమున వేంగి పేర్కొనబడినది. అతడు దక్షిణహిందూదేశముపై దండు వెడలి కళింగము మీదుగా కాంచీపురమువఱకు దిగ్విజయయాత్ర సాగించెను. ఈదండయాత్రలో నతడు జయించిన దేశము వేంగియొకటి. దానిని పాలించిన ప్రభువు హస్తివర్మ. వేంగి దేశమును పాలించిన నత్యంత ప్రాచీనుఁడైన విజయదేవవర్మ యొక్క శాసనమును వేంగీపురమునుండి

---

(గ) దాక్షారామములోని కోనపోతరాజు శాసనములో నీవిషయము స్పష్టము గావింపబడినది. కోనపోతరాజు కులోత్తుంగచోడునిచే సహస్రగ్రామ పరిమితమైన వేంగిదేశమును బడసినట్లు తెలియుచున్నది. చూడుడు.

"తస్యాసీన్మహనీయకీర్తి లతికా కందాలవాలోల్లసత్సౌజన్యాది మహాగుణైక వసతిః శ్రీ కోనపోతః కృతీ.

జిత్వా యస్త్రికళింగవల్లభమహో రాజేంద్రచోడాయవై ప్రాదాద్దుర్జయరాజవంశతిలకః కాళింగగండద్విపాన్.

యః కులోత్తుంగచోడస్య కారుణ్యేనాలభద్విభుః.
వేంగీంద్ర నామధేయంచ వేంగీగ్రామసహస్రకం.

దక్షిణహిందూదేశ శాసనసంపుటము 4. సంఖ్య 1153.

(జ) దక్షిణహిందూదేశశాసనసంపుటము 6. సంఖ్య 96. శా. శ. 1157.

ప్రకటించెను. ఆశాసనము ప్రాకృతమం దున్నది. ఈవిజయదేవవర్మ సాలంకాయనగోత్రుడు. చిత్రరథస్వామి సేవాపరుడు.

సిరీవిజయవెంగిపురా భగవతో చిత్తరథస్వామిపాదానుజాతస్స బప్పబట్టారక పాదబట్టస్స సాలంకాయనస్స అస్సవెధయాజినో మహారాజ సిరీ విజయదేవవమ్మ స్స వయణేన ఎలూారె ముళుద పముఖో గామో భాణితవ్వో (ఉ)

పై శాసనము యొక్క తాత్పర్య మేమనగా "శ్రీవిజయ వేంగీపురమునుండి చిత్రరథస్వామి పాదానురక్తుడును, బప్పభట్టారక పాదసేవకుడును, సాలంకాయనుడును, అశ్వమేధయాజియు, మహారాజ శ్రీ విజయదేవవర్మ ఏలూారు గ్రామనాయకుల పురస్సరముగా ఏలూరు గ్రామవాసుల కీవిధమున నాజ్ఞాపించుచున్నాడు."

ఈ వేంగిపురమె యిప్పుడు పశ్చిమగోదావరిమండలమున నేలూరు పట్టణమున కెనిమిదిమైళ్ళదూరమున నున్నది. ఆప్రదేశమున నిప్పుడు పెదవేగి, చినవేగి యను రెండుగ్రామములు గలవు. శాసనములో వ్రాయబడిన ఏలూారె, యిప్పటి యేలూరుపట్టణము. చిత్రరథస్వామి దేవాలయ మిప్పటికిని నిలిచి యున్నదని తెలియుచున్నది.

వేంగిరాష్ట్రము ఐదు, ఆఱుశతాబ్దములలో దక్షిణమున నెల్లూరు మండలము వఱకు వ్యాపించి యుండెననుటకు యువమహారాజ పల్లవవిష్ణుగోపవర్మ మాంగలూరు శాసనము వల్ల విదితమగుచున్నది. ఈశాసనము నెల్లూరిజిల్లా దర్శితాలూకా దర్శిగ్రామము (దశనపురము) నుండి యొసగబడినది. ఈ శాసనములో వేంగోరాష్ట్రము (వేంగిరాష్ట్రము) పేర్కొనబడినది. (ఊ)

---

(ఉ) ఎపిగ్రాఫియా ఇండికా సంపుటము 9. పుట 57.

(ఊ) Indian Antiquary Vol. V. page 154.

## వేంగిరాష్ట్రము–గుద్రహారవిషయము

వేంగిరాష్ట్రము- వేంగి, గుద్రహారవిషయములుగ విభజింపఁబడినట్లు పై శాసనములవల్ల విదితమగుచున్నది. ఈ గుద్రహారవిషయము శాలంకాయన బృహత్ఫలాయన, విష్ణుకుండిన, చాళుక్యప్రభువుల కాలములో ప్రసిద్ధిగాంచిన విషయములలో నొకటి. మచిలీపట్నమునకు వాయవ్యమున నాల్గుమైళ్ళదూరమునను, ఘంటశాలకు ఆఱుమైళ్ళదూరముననున్న గూడూరను పేరవిలసిల్లెడి గ్రామమె, యీ విషయమునకు ప్రధానగ్రామము. దీనిని బట్టియే యీవిషయమునకా పేరు గల్గెను. ఈగ్రామమె 'కూడూర' యని అమరావతిశాసనములందు పేర్కొనఁబడినది. ఇదియె టోలమీ (Ptolemy) పేర్కొన్న కొడ్డూరము. (త) బృహత్ఫలాయన మహారాజ జయవర్మ కొండమూడి శాసనములో నియ్యది కూడూరహారమని చెప్పఁబడినది. శాలంకాయనుల శాసనములలో నియ్యది కుడూహార విషయమనియు కుద్రాహార విషయమనియు వ్రాయఁబడియున్నది. (ద) శ్రీ విజయస్కంధవర్మ, నందివర్మల కంతేరు శాసనములప్రకారము, ఈ గుద్రహార విషయము కృష్ణానదికి దక్షిణమున తెనాలితాలూకా వఱకును వ్యాపించియుండెనని చరిత్రకారులు భావించుచున్నారు. దానికి కారణము శాసనములు లభ్యమైన కంతేరు గుంటూరునకు సమీపముననుండుటచేతను, విజయ

(త) Dubreuil Ancient History of the Deccan pages 85-88.

(ద) (1) "శ్రీ విజయస్కంధవర్మణో వచనాత్కుడూహార చిన్తపురే"

(2) "శ్రీ నందివర్మే కుద్రాహారే విషయే కురువాడగ్రామే"

(3) మహారాజ శ్రీ విజయనందివర్మ కుడుహారవిషయే"

ఆంధ్రచారిత్రకపరిశోధనమండలి పత్రిక. సంపుటము 5. పు. 30.31.

కంతేరుశాసనములు; South Indian Palaeography పుట 135.

విజయనందివర్మ కొల్లేరుశాసనము.

స్కంధవర్మ శాసనములో సూచింపబడిన చిత్తపురము లేక చింత పురము తెనాలితాలూకాలోని చింతలపూడియై యుండునని నిర్ణయిం చుటచేత నైయున్నది. ఈశాసనములో పేర్కొనబడ్డ రెండవగ్రామము 'లేకుమారి' కైకలూరు తాలూకాలోని లోకముడి యని నిర్ణయిం చుటచేత, చిత్రపురము లేక చింతపురము సహితము వేంగికి సమీపముననే యుండవలెనని తోచుచున్నది. ఈచింతపురము ఏలూరునకు సమీపముననున్న చింతలపూడియై యుండునని నేను భావించు చున్నాను. నందివర్మశాసనములోని కురువాడ (కురవటము) వేంగికి సమీపమున నుండెడిగ్రామమేగాక, గుడివాడతాలూకాలోని కూరాడ కాజాలదు. వేంగిలోని తమ్మిలేరు ప్రాంతముల కురవాటమున్నదని, యిదివఱకు దృష్టాంతసహితమున నిరూపించియున్నాను. అది యట్లుండ పూర్వచాళుక్యశాసనములలో నీ కుడూహారవిషయము, గుద్రవార, గుద్రహార, గుద్ద్రావారమని పేర్కొనఁబడినది. ఈశాసనములలో గుద్రాహారములోని గ్రామములన్నియు, అవనిగడ్డ, బందరు, కైక లూరు, గుడివాడ, ఏలూరుతాలూకాలలో నున్నట్లు చరిత్రపరిశోధకు లిదివఱకె నిరూపించియున్నారు. (న) కంతేరుశాసనముల ననుస రించియే వేంగిరాజ్యము శాలంకాయనుల కాలమున, గుంటూరు మండలము వ్యాపించియుండెనని చెప్పుట సమంజసముగాదు.

---

(న) (1) పూర్వచాళుక్యప్రభువుల శాసనములు-ఎపిగ్రాఫియా ఇండికా సంపుటము 5. పుటలు 123, 126, 135, 138, 140, 142.

(2) దక్షిణహిందూదేశశాసనసంపుటము 5. సంఖ్య 211. గుడివాడశాసనము (గణపతిదేవుని శాసనము, శా. శ. 1158.)

(3) దక్షిణహిందూదేశశాసనసంపుటము 4. సంఖ్య 807. శా. శ. 1071 నాదెండ్లశాసనము. "శ్రీ కేశవదేవరకుం జెల్లపుగుద్రహారములో పలివందిగామ నూరపరెడ్డికూతురు యంత్యమ."

అది యట్లుండ బృహత్పలాయన మహారాజ జయవర్మ కొండ ముూడి శాసనము ననుసరించియు, (ప) బృహత్పలాయనుల కాల మునసహితము కూడూరహారవిషయము గుంటూరుజిల్లా వఱకును వ్యాపించియుండెనని కొందఱు చరిత్రకారు లూహించుటకు సమంజస మైన హేతువులు లేవు. ఆశాసనములో పేర్కొనఁబడిన కూడూర హారములోని పాంటూరగ్రామము 'దుబ్రెయిల్' చరిత్రకారుడు బందరు తాలూకాలోని పాండూరుగ్రామమని నిరూపించినాడు. కాబట్టి శాలంకాయనుల కాలములోగాని వేంగి కృష్ణకు దక్షిణమున వ్యాపించి యుండలేదని నాయభిప్రాయము. ఇట్టిది చాళుక్యుల కాలముననే సంభవించెనని, వారిచరిత్రయే సాక్ష్యమిచ్చుచున్నది. ఆవిషయము విస్తరించి వ్రాయనక్కఱలేదు.

ఈ వేంగిరాజ్యము చాళుక్యులకాలమున గోదావరిజిల్లా ఉత్తర దిక్కున విశాఖపట్టణమండలములోని చీపురపల్లి తాలూకావఱకును దక్షిణమున నెల్లూరుజిల్లావఱకును వ్యాపించియుండెను. వేంగిరాజ్యము నకు మొదట వేంగిపురమె ప్రధాననగరమై చాళుక్యులకాలమున రాజ మహేంద్రుఁడని బిరుదుగాంచిన అమ్మరాజవిష్ణువర్ధనుని కాలముననో రాజరాజనరేంద్రుని కాలముననో రాజధాని రాజమహేంద్రవరము నకు మార్చబడియుండెను. నన్నయభట్టు రాజమహేంద్రపురము వేంగిదేశమునకు నాయకరత్నమని మహాభారతమున వ్రాసియున్నాఁడు. నన్నయభట్టుగావించిన వేంగీదేశవర్ణనయు, నెల్లూరుమండలవాసులైన కేతనయు, నెఱ్ఱాప్రెగడయుఁ దాము వేగిదేశములోనివారమని చెప్పు

(ప) జయవర్మ కొండముూడిశాసనము. ఎపిగ్రాఫియా ఇండికా సంపుటముll. పుటలు 315-19.

"కూడూరహార గామవ్ పాన్టూరవ్ బమ్మహదెయవ్ దదామ"

కొనుట చేతను, వేగిదేశము దక్షిణమున నెల్లూరుమండలము వఱకు వ్యాపించియుండెనని ఆంధ్రసారస్వతము విశదము చేయుచున్నది. (ఌ)

## వేంగిరాష్ట్రము–గుద్రవారద్వయము

శాలంకాయనుల శాసనములలోను, కొన్ని పూర్వచాళుక్యుల శాసనములలోను జూపబడిన ఇప్పటి పడమటిగోదావరి, కృష్ణాజిల్లాలలో నంతర్భాగమైన గుద్రహారముగాక, గోదావరీస్రవంతికి ఉత్తరమున నున్న నేటి రామచంద్రపురము తాలూకాలో మరియొక గుద్రహార మున్నట్లు మరికొన్ని పూర్వచాళుక్య, వెలనాటిచోళుల శాసనముల వల్లఁ దెలియుచున్నది. మల్లిదేవచోడుని పిఠాపురశాసనములో పిఠాపురమున శ్రీ కుంతీమాధవదేవరకు గుద్దవాదిలోని ఓదియూరనెడియూరు దానముచేయబడినట్లు వ్రాయబడినది. ఈ ఓదియూరు రామచంద్రపురము తాలూకాలోని ఓదూరుగ్రామము. అట్లే రామచంద్రపురము తాలూకాలోని కోరుమిల్లియు గుద్దవాదిలోనిదని తెలియ నగును. విష్ణుకుండి మూడవమాధవవర్మ ఆంధ్రపరిషచ్ఛాసనములో గుద్దవాదివిషయములోని దశయవాది తీరముననున్న పులుంబూరు పేర్కొనబడినది. ఈ పులుంబూరు రామచంద్రపురముతాలూకాలో తుల్యభాగతీరముననున్న పొలమూరు గ్రామమె.

ఇక రామచంద్రపురముతాలూకాలోని ద్రాక్షారామ శాసనములలో నాగ్రామము గుద్దవాదినాంటిలోనిదని చెప్పబడినది. గోదావరినది కుత్తరముననున్న గుడ్డవాది నేఁడు. కృష్ణ కుత్తరమున, గోదా

(ఌ) కేతన చెప్పిన 'వెజ్జేరాల' లేక 'వెంటిరాల' యను గ్రామమును, ఎఱ్ఱాప్రెగడ వ్రాసిన 'కరాపర్తి' గ్రామము నెల్లూరిమండలములోని గ్రామములై యుండును. 'కరాపర్తి' రాపూరు తాలూకాలోని కనుపర్తిగాని, కనుపూరుపల్లిగాని యైయుండునేమో! వెట్టేరాల వెంటాద్రిల కానోపును.

వరికి దక్షిణముననున్న అనగా కృష్ణాగోదావరి మధ్యములనున్న గుదిహారము వేఱు. కావున నేకాబోలు వెలనాటిపృథ్వీశ్వరుని పిఠాపుర శాసనములో విమలాదిత్యుడు తనకుచేసిన సహాయముచే సంతుష్టుడై వెలనాటిరాజైన కుడ్యవర్మకు గుదివారద్వయమును బ్రసాదించెనని వర్ణింపబడినది. (మ) కాకతీయసామ్రాజ్య మంతరించిన తర్వాత పదునాల్గవ శతాబ్దమున నీగుదిహారము కృష్ణాగౌతమీ మధ్యప్రదేశ మని వర్ణింపబడినది. సింహాచలములోని కొప్పులకాపయనాయకుని కుమారుడు పోలియ శాసనములో కొప్పులకాపయ కృష్ణాగౌతమీ పరివృతమైన గుదివాటి కధిపతియని వ్రాయబడెను. (య) ఇదియే గుదివాటిని పేర్కొన్న కడపటిశాసనమని తలచుచున్నాను.

---

(మ) (1) విష్ణుకుండి మాడవమాధవవర్మ శాసనము భారతి. ప్రమోదూత సం॥ భాద్రపదమాస సంచిక.

(2) మల్లిదేవుని పిఠాపురశాసనము శా. శ. 1117. ఎపిగ్రాఫియా ఇండికా సంపుటము 4. పు 92.

(3) పృథ్వీశ్వరుని పిఠాపురశాసనము ఎపిగ్రాఫియా ఇండికాసంపుటము 4. పు 32-84.

(4) కోరుమిల్లిశాసనము ఇండియన్ ఏంటిక్వెరి సంపుటము 14. పుట 53.

(5) ద్రాక్షారామశాసనములు దక్షిణహిందూదేశ శాసనసంపుటము 4. సంఖ్యలు 1015, 1017, 1018, 1281.

(1) గుద్దవాదివాటి పెద్దడాకిరేమి; (2) గంగ్గగొండ చోడవలనాటి గుద్దవాదివాటి పెద్దడాకిరేమి; (3) గుద్దవాదివాటి ప్రోలిండుటం కట్టడము (1281).

ఈ కడపటి శాసనములో రామచంద్రపురము తాలూకాలోని కుందూరు, వెల్లగ్రామములు పేర్కొనబడినవి.

(య) "కృష్ణా గౌతమవాహినీ పరివృతా గుదవ్రాటికో<br>నరాధీశ కుంజరకర్ణచామర యశాః శ్రీ కాపయాభ్యో నృపః॥"

శా. శ. 1282.

దక్షిణహిందూదేశశాసనసంపుటము 6. సంఖ్య 822.

## వెలనాడు

కులోత్తుంగచోడగొంకరాజు పాదారాధకుఁడైన కొమ్మనాయకుని శాసనములో వెలనాఁడీవిధమున వర్ణింపబడినది. (1)

"అస్తి స్వస్తి మదగ్రహార నగరగ్రామైః సమగ్రశ్రియా
జుష్టః పుష్టజనోమహీంగతమివ స్వర్మండలీ ఖండలం
ఆరామైరభిరామ భూమిరభితశ్శాలేయ కేదారజః
శ్రీ శాలీ వెలనాండు నామ విషయో భూమండలీ మండనం॥"

వెలనాండు మహీమండలమండనంబైన ఉామలూరి విభుండును, ఈవనికండ్రవాడి విషయవిశేషంబైన కుఱుంగంటి శాసనుండును.

ద్రాక్షారామములోని వెలనాటి గొంకరాజు యొక్క యొక శాసనములో వెలనాం డాంధ్రదేశతిలకమని యభివర్ణింపబడినది. (2) ఈవెలలనాడు వెలనాటి చోడుల మూలపురుషుఁడైన మల్లవర్మ త్రిలోచనపల్లవునికి యుద్ధములలో సాహాయ్యమొనర్చి వెలనాటిని సామంత రాజచిహ్నములతో బడసెనని ద్రాక్షారామములోని రెండవగొంక రాజు శాసనములో వక్కాణింపబడినది.

"శ్రీ వల్లభ స్యాంఘ్రి సరోజతో వా నిరంతరో దివ్యనదీప్రవాహః
జాతాచ శుద్ధశ్చరణాబ్జతో వా చతుర్థవంశ చతురాననస్య
వంశేస్మిౕ సహిమాంశు నిర్మలయశ వ్యాప్తక్షమా మండలః
శ్రీమాౕ వీరరసాశ్రయో గుణనిధిః శ్రీ మల్లభూపోజని
యేన త్ర్యంబక పల్లవాదరిణ శిరస్సాహాయ్య కారాచిరాౕ
ప్రాప్తోయం వెలనాణ్డు నామవిషయ స్సామంత చిహ్నైస్సహ॥ (3)

---

(1) దక్షిణహిందూదేశ శాసనసంపుటము 6. సంఖ్య 239.

(2) దక్షిణహిందూదేశ శాసనసంపుటము 4. సంఖ్య 1105.

(3) దక్షిణహిందూదేశ శాసనసంపుటము 4. సంఖ్యలు 1141, 1182.

ఈ వెలనాటిని బేర్కొన్న మొదటిశాసనము పూర్వచాళుక్య ప్రభువైన ప్రథమ విజయాదిత్యుని క్రీ. శ. 763 నాటిదియై యున్నది. దీనిలో వెలనాటి విషయములోని 'శాకరంబు' గ్రామమును కారంచేడు వాస్తవ్యుడైన దేవశర్మయను బ్రాహ్మణునికి విజయాదిత్యుడు దాన మొసగినట్లు చెప్పబడినది. (4)

వెలనాటి మండలేశ్వరులకు రేపల్లె తాలూకాలోని చందవోలు రాజధానిగ నుండెను. దీనికే ధనదవోలను నామాంతరము గలదు. వెలనాటి రెండవగోంకరాజు ద్రాక్షారామశాసనములో నతడు వెల నాటిలో ధనదేశ్వరనగరమునకు (అలకాపురి) సాటివచ్చు ధనదప్రోలు పట్టణము నేలుచుండెనని చెప్పబడినది. (5)

స్వస్తి శ్రీ వెలనాండు నామవిషయే తస్మిన్మహద్భూతలే
ప్రఖ్యాతో ధనదేశ్వరస్యపుర సద్వృత్తోన్నతో శ్రీ......॥

---

(4) Epigraphical Report. Madras 1916-17. page 11 and 116.
ఈశాసనములో వెలనాడు విశాణాండని పేర్కొనబడినది. ఇయ్యదియె వెలనాటికి ప్రాచీననామమని తెలుసుకొననగును.

(5) (1) దక్షిణహిందూదేశ శాసనసంపుటము 4. సంఖ్య 1130. (శా. శ. 1079.)

(2) ద్రాక్షారామములోని వెలనాటి చోడుల శాసనము (శా. శ. 1072) లో మొదటి గోంకరాజు తనప్రభువైన శ్రీ కులోత్తుంగ చోడునికి యుద్ధములలో సహాయమొసర్చి ఆటువేలనాటిని (పట్న హాప్రవని) పరిగ్రహించి చాలకాలము పరిపాలించెనని వ్రాయ బడినది. ఈ వెలనాటికే పట్నహాప్రదేశమను ప్రతినామము చెల్లెనని యూహింపదగును.

"సంగ్రామ సాహాయ్యసుతుష్టచిత్తాత్ శ్రీ రాజరాజప్రథవాన్నృవీరః
యః పట్నహాప్రవని మండలాధిపత్యం సమాసాద్య చిరమ్బువక్తి॥

దక్షిణహిందూదేశ శాసనసంపుటము 4. సంఖ్య 1182.

............హాకారవల్లభ ఇతి శ్రీ గొంకభూపాలక
స్తస్యాజ్ఞా పరిపాలితా సనదవోప్రోలునామాతి రమ్యాపురీ॥

వెలనాటికి మొదట రాజధానిగనుండిన చందవోలును మంచెన కవి తన కేయూరబాహుచరిత్రమునం దిట్లభివర్ణించి యున్నాఁడు.

సీ. పుష్పకనివహంబు భూమిపై నిలిచిన
యట్లందమైన దేవాలయములు
రూప్యాచలము బహురూపంబుల నటించు
రమణశోభిల్లుసౌధముల పెల్లు
అలకాధిపతి నిధులన్నియు వెలిపీట
విడిసినకరణిఁ బుణ్యవీథికలును
ధాత మేదిని మిన్నుదట్టించి పైచినమాడ్కిఁ
గనుపట్టు బహుతటాకముల సొంపు

గీ. నుపవనంబులు సరసులు నొప్పు చేయు
చెఱకుఁదోఁటలుఁ బ్రొసంగుచేలు మెఱయ
నఖిలవిభవంబులకు నెలవగుచు వెలయు
ధనదుపురమున కెనయగు ధనదుపురము.

(మొదట నుదాహరించిన యొక శాసనములో సనదవోప్రోలు 'ధనదేశ్వరస్య పురసద్వృత్తోన్నతో శ్రీ......' యని వర్ణింపబడినట్లు గమనింపవచ్చును.)

అదియునుగాక చందవోలు ప్రజలయొక్క వైభవము సహిత మిట్లు వ్రాసియున్నాడు.

గీ. మంటికడవ నులకమంచంబు పూరిల్లు
నూలిచీర రత్నకీలితంబు
గాని పైడితొడవు గలుగుటెఱుంగరు
ధనదుపురములోని జనములెల్ల.

ఈక్రింది శాసనములలో పేర్కొనబడ్డ గ్రామముల యునికిబట్టి వెలనాటి విస్తీర్ణము నిర్ణయింపవచ్చును.

(1) "వెలనాండా మోత్రింతుకూరు నామగ్రామం"
మోతుకూరు బాపట్ల కారుమైళ్ళదూరమున నున్నది.

(2) "ఆఱువేల వెలనట్టి అగ్రహారంబు వలివేరి త్రైపురుషస్థానమున"
వలివేరు తెనాలితాలూకాలోని గ్రామము.

(3) "శ్రీమన్మహామండలేశ్వర కులోత్తుంగ రాజేంద్రచోడయ రాజుల కొట్టరి వెలనాంటిలోని నిడుంబ్రోలి......"
నిడుంబ్రోలు బాపట్లకు సమీపముననున్న నిడుబ్రోలు.

(4) "చోడమండలమున వెలనాణ్టి పెరుంబణ్ణూరను నుండెను"
ఈపెరుంబణ్ణూరు తెనాలితాలూకాలోని పెనుమర్రు గానోపును.

(5) "శ్రీ డావులూరో స్సహశాస నేన ప్రాదాత్ప్రభుత్వాం
వెలనాటి దేశే తద్దేశకూటావళి సన్నిధానే
సోయంవిభుః కొమ్మయ నాయకాయ"
డావులూరు తెనాలితాలూకాలోని గ్రామము.

(6) అమ్మరాజవిజయాదిత్యుని మెలపఱ్ఱుశాసనములో నాగ్రామము వెలనాండు విషయములోనిదని వ్రాయబడినది. పైగ్రామము రేపల్లెతాలూకాలో చందవోలునకు సమీపమున నున్నది.

(7) కృష్ణాజిల్లా గణపవరములోని కాకతీయులకాలమునాటి యొక శాసనములో పెదదేవిపురము వెలనాటిలోనిదని యొకసీసపద్యములో వర్ణింపబడినది.

సీ. తమతల్లిదండ్రుల ధర్మువు రాజ్యాభి
వృద్ధియుం గాదన బుద్ధిగోరి

శరగుణ రవిమిత శకసమాసిత పుష్య
సురపతితిథియును గురుదినమున
వెలనాంటిలోపల వినుతింపగాంబేరు
గలిగి కృష్ణాబ్ధి సంగమమునందు
పోలుపైన పెదదీవిపురమున గుణపతీ
శ్వరదేవునకుగాని శరమునేథ
గీ. యింటి నొసగి పెయ్యలేంబది వెరసి
నూరును నఖండదీపమునకు భక్తి దనర
గా రవీందు తారకముగ నిచ్చి
పుల్లరియును విడిచె భూనుతుండు. (6)

## వెలనాడు—ఆఱువేలు

ఇతరనాడులవలెనే, వెలనాడు సహితము ఆఱువేల గ్రామపరిమితి గలప్రదేశమని శాసనములలో వక్కాణింపబడినది. "స్వస్తిశ్రీ సర్వలోకాశ్రియ శ్రీ విష్ణువర్ధనమహారాజుల ప్రవర్ధమాన విజయ రాజ్య సంవత్సరంబులు 41–శకవర్షంబుల 983 నేంటి ప్లవ సంవత్సరంబున బేరేటి దక్షిణంబున యాఱువేలవెలనంటి......అగ్రహారంబు

(6) (1) ఎపిగ్రాఫియా ఇండికా సంపుటము 6. పుటలు 38-40.
(2) దక్షిణ హిందూదేశ శాసనసంపుటము 10. సంఖ్య 8.
(3) " " " 4. " 1114.
(4) " " " 4. " 1295.
(5) " " " 10. " 91.
(6) ఇండియన్ ఆంటికేర్వి సంపుటము 12. పుట 91.
(7) దక్షిణహిందూదేశశాసనసంపుటము 4. సంఖ్య 952.

(సశేషము.)

# గ్రంథస్వీకారము-సమీక్ష

శ్రీ బందారు తమ్మయ్య

(1) కాంగ్రెసు విజయము (నాటకము) క్రౌను
పుటలు 76 వెల 1-0-0

(2) (i) ప్రజారాజ్యము (సామ్యవాద నాటకము)
క్రౌను పుటలు 72

(ii) ఉపాధ్యాయుడు (ఏకపాత్ర నాటిక)
పుటలు 16 రెండుకలిపి వెల రు 1-0-0

(3) జయభేరి (ఖండకృతి)
క్రౌను పుటలు 48 వెల రు 0-8-0

రచయితలు : ఉభయభాషాప్రవీణ శ్రీ జాస్తి వెంకట నరసయ్యగారు, విద్వాన్ ధూళిపాళ వేంకట సుబ్రహ్మణ్యము గారు, B.A.

(4) ప్రయోజనవిద్య (వచనము)
క్రౌను పుటలు 24 వెల రు 0-4-0

కర్త : శ్రీ జాస్తి వెంకటనరసయ్యగారు

(5) శరణాలయ దాత (పద్యములు)
క్రౌను పుటలు 12 (అమూల్యము)

కర్త : పల్నాటికవి శతావధాని శ్రీ కన్నెకంటి వీరభద్రాచార్యులుగారు

జాతీయభావోద్దీపితులగు శ్రీ జాస్తి వేంకటనరసయ్యగారి కృతులను గొన్నిటిని సమీక్షచేయునెడ సం. 45 సం. 5 లో వారి పరిచయము పాఠకులకుఁ గొంత కావింపఁబడినది. అట్టి భావోత్తేజనముగలవారే వారి సహచరులు శ్రీ ధూళిపాళ వేంకటసుబ్రహ్మణ్యముగారు కూడ. వారు ప్రాచ్యభాషా పట్టభద్రత, ఆంగ్లభాషా పట్టభద్రత రెంటిని గూడ నందిన పండితులు. సత్యాగ్రహోద్యమములో వీరుగూడ నరసయ్యగారివలె నప్పటిప్రభుత్వమువారి కారాగారాతిథ్యమును గ్రహించినవారే. జాతీయభావవిలసితులగు నియ్యిరువురుగూడ నొక్కే చోట చిలకలూరుపేట ఉన్నతపాఠశాలలో నుపాధ్యాయులుగా గుదురుట పరమేశ్వర విలాసపూర్వకములైన ఘటనావిశేషములలో

నొకటి. ఎవరికి వారు స్వతంత్రరచనల వెలువరించుటయేగాక ఉభయులు గలిసి జాతీయరచనములు గొన్ని వెలువరించుట కిది యుపకారకమైనది. పైని బేర్కొనిన కృతులలో 1, 2, 3 సంఖ్యగల వీ జంటకవులు కలిసి రచించినవి.

(i) కాంగ్రెసు విజయములో భారతదేశమున 1885 సంవత్సరమున కాంగ్రెసు నెలకొనినది మొదలుకొని 1947 సంవత్సరములో దేశమున సంపూర్ణస్వరాజ్యసిద్ధి యేర్పడువరకు నడుమ 60 ఏండ్లలో ఘటిల్లిన కాంగ్రెసుచరిత్ర సంస్కరణాంకము, సంపూర్ణ స్వరాజ్యాంకము, ప్రజావిప్లవాంకము అను మూఁడు ప్రధానాంకములుగ విభక్తమయి యందు వేర్వేఱుగ మొత్తము 25 రంగవిభజనములతో వివరింపఁబడినది. అందుఁ బ్రథమరంగము నేఁటి భారతదేశ ప్రధానమంత్రి శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ అలహాబాదులో ఆనందభవనమున విద్యాభ్యాసకాలమున 1904–1905 లో తన యాంగ్లవిద్యాగురువు బ్రూక్సుతోడను, తండ్రి మోతీలాల్ తోడను నెఱపిన విస్రంభసంభాషణముతోఁ బ్రారంభ మగును. ఇతరరంగములలోఁ గొన్ని యాంధ్రప్రదేశమునకుఁ బ్రసక్తించి యాంధ్రనాయకులు శ్రీ ప్రకాశంపంతులు, ఆచార్య రంగా మున్నగువారి ప్రసంగములతోఁగూడ నలరారుచున్నవి. పాత్రముల సంభాషణములు చాలవఱకు వచనమునందే యున్నను, అందందు సముచితస్థానములలోఁ బద్యములు గేయములు గూడఁ గూర్పఁబడియున్నవి. జనసామాన్యమునకు జెందిన కాంగ్రెసు సేవకుల సంభాషణములలోఁ జాలవఱకుఁ బాత్రోచితమగు వ్యావహారిక భాష వాడఁబడినది. జాతీయసంగ్రామమందలి ప్రధానఘట్టముల వివరములతో కాంగ్రెసుచరిత్రను, పలుపాట్లుపడి దేశీయులు సాగించిన విజయసాధనములను సంగ్రహముగఁ దెలియఁగోరు దేశాభిమానులు దీనిని దప్పక యాదరించి పఠింపఁదగును. 1945 జనవరిలో

ప్రథమముద్రణము, 1956 ఆగస్టులో ద్వితీయముద్రణము పందిన యిది, యిదివఱకే ప్రజాదరణమును బడసినదని చెప్పఁదగును. ఆచార్య రంగా, భోగరాజు పట్టాభిసీతారామయ్యగారి యభిప్రాయములు, శరణు రామకోటయ్యగారి పరిచయవాక్యములు గ్రంథారంభమున ముద్రితము లయి యున్నవి. శ్రవ్యకావ్యములకన్న దృశ్యకావ్యముల కున్న ప్రయోజనవైశిష్ట్యము సర్వప్రపంచవిదిత మగుటచే నందుఁ గూర్చినప్రశంస యనవసరము.

"ఈ నాటకపు నడక, మాటలు, పద్యాలు అన్నియు ఈనాటి విప్లవయుగపు వడిని, ఉత్సాహమును ప్రకటించుచున్నవి. గ్రంథ కర్తలు దేశభక్తులు, జైలునకు పోయివచ్చిరి. గాంధిజీ పథానువర్తులు" అని రంగాగారును, "మామూలుదృశ్యములు చిత్రలేఖనములందు జూచునపుడు అమితసౌందర్యమును దాల్చును, మామూలు భావములు గద్యపద్యయుతమగు నాటకరూపమున బ్రదర్శింపబడినపుడు ఎంతయో ఉద్రేకజనకముగా నుండును. ఇట్టి యత్నమునకు గ్రంథ కర్తలు పూనుకొని జయమును గాంచిరి." అని పట్టాభిగారును ప్రకటించిన యభిప్రాయములు యథార్థములని మేమును భావించుచున్నాము.

ఇందలి పద్యాదియముల కొండు రెండుదాహరణములు –

కోకిలా నెహ్రూ కీర్తన :

భారతజాతికి శక్తి లేదా! బానిసత్వ మిక తొలగబోదా!
శుకపిక సంతతిశోభల మీఱఁగ, వికవిక స్వేచ్ఛల విఱ్ఱవీగుగతి।
సకలవిధంబుల స్వాతంత్ర్యముతో ఇక నీదేశం బెన్నటి కో నో!

కాంగ్రెసుసేవకుఁడు తుమ్మల బసవయ్య జైలుకు గావించెడి యుద్బోధములు :

"ధనమా కూడును, దాస్యమా యుడుగు స్వాతంత్ర్యంబు చేకూరెడి
క్షణమా కల్గును, కామమా తీఱుగు సౌఖ్యంబా కడు[illegible]

విసయుంబొ జనియించు ధైర్యరసమయూ పెంపొందు నింపొందఁగఁ మనమాధ్యాత్మికచింతలోఁ దవ్వులు కాట్నశ్రీని జేపట్టినఁ".

ఇందు "ఘనమా" యను విశేషణరూపముకన్న "ఘనతా" యను విశేష్యరూపమే సంభావ్యము.

గత మూడుసంవత్సరములనుండి (పుట 4) జాతీయసంఘైక్యత (పుట 12) భారతైక్యత (పుట 23) ప్రత్యక్షపోరాటము (పుట 26) మున్నగు ప్రయోగస్ఖాలిత్యము లందందుఁ గలవు. ఇట్టివి సంస్కరణయోగ్యములని మనవి.

(2) ప్రజారాజ్య మనునామమే యీనాటకమందుఁ బ్రతిపాదిత మయిన సామ్యవాదమునకు, అందుకయి సాగిన సంఘర్షణములకు సూచకము కాఁగలదు. ఇందు రంగవిభజనమే గాని యంకవిభాగము లేదు. శ్రమజీవులకు (కార్మికులు) ధనికుల (పెట్టుబడిదారులు) వలనఁ గలిగెడు కడగండ్లు కడతేరి సుఖజీవనమునకయి యా కార్మికులు సత్యాగ్రహపూర్వకముగఁ గావించిన పోరాటముఫలితముగ సాధించిన సామ్యవాదవిజయ మిందలి యితివృత్తము. రఘునాథ్ అను జమీందారు, వెంకయ్య యను జమీర్కారైతు, తత్కుమారుఁడు గోపాల్, ప్రకాశ్ అను దేశభక్తుఁడు, అతని భార్య కరుణ, నారదాసు అనెడి ఆదిమాంధ్రకార్మికుఁడు, అతని కూఁతురు భారతి యిందలి ప్రధాన పాత్రములు.

జమీందారుల దుండగములు, రైతులకు వారివలనఁ గలిగెడి బాధలు, పోలీసు ఉద్యోగులు లంచగొండులై, ధనికులకువశ్యులై తమ యుద్యోగధర్మముల సక్రమముగ నిర్వహింపమిఁ గార్మికులకుఁ గలుగు కష్టనష్టములు దేశభక్తుడు ప్రకాశ్, తత్సతి కరుణ ప్రచ్ఛన్నవేషములతో నజ్ఞాతవాసమొనర్చుచుఁ గావించిన యుద్బోధఫలితముగ రయితులలోఁ గలిగిన చైతన్యమూలకముగ నెఱవేఱిన సామ్యవాదవిజ

యము, తుదకు రఘునాథ్ మానసికపరిణామమంది జాతీయభావముల
నాదరించుట యిందు బాగుగాఁ బ్రతిపాదితములయినవి. ఇందుఁగూడఁ
బాత్రోచితమగు వ్యావహారిక భాష యథాయథాపాత్రల సంభాషణము
లలోఁ బ్రయుక్తమయినది. కాంగ్రెసువిజయమువలెనే యిదియు నింత
వఱకు రెండు ముద్రణములనొంది పలుతావులఁ బ్రదర్శింపఁబడినట్లు
కూడఁ దెలియుచున్నది. పాత్రముల ప్రసంగములలో వచనమే యెక్కు-
వగ నుపయోగింపఁబడినది. సామ్యవాదులు, దేశాభిమానులు తప్పక
దీని నాదరించి విశేషప్రచారమునకుఁ దోడ్పడఁదగును.

ఇందలి పద్యగేయములకుఁ గొన్నియుదాహరణములు.

"దొంగ యెవండో యింటఁబడి దోఁచుచునుండఁగఁ గన్నులార యే
వెంగలి చూచి కర్మయని వేగిర మొందక యుండుఁ జెప్పుమా
సంగరభూమిఁ దన్నెదిరి శాత్రవవీరుఁడు కత్తి దూయఁగా
లొంగు నెవండు కర్మయని లోఁగొనఁ జూడక వైరివీరులన్॥"

"కూలీ నిదుర మేల్కొనరా । ఆఁకలిమంటల పులమలమాడే
ఎముకలు విరిగే హీనపుచాకిరి । కండలు కరిగే కఠినపరిశ్రమ
పాటే నీది ఫలిత మింకొకరిది । కడుపుకు గంజే కఱవౌ గాదా
మానవత్వమే మాయముచేసే । పశువురీతినే బాధలుపెట్టే
కర్మముపేరా । ధర్మము పేరా
మర్మముతోడ మాయలఁజిక్కె॥ కూలీ॥

"భాగ్యవంతుని ముక్కునఁ బడిసెమైన
ప్రకటితంబౌను పో గొప్ప వార్తయటులు
శ్రామికులు రోగములఁ జిక్కి చచ్చుచున్న
అనుకొనెడివాఁడె యుండఁ డీయవనిమీఁద."

(ii) ఉపాధ్యాయుఁడు : భారతభాగ్యవిధాయకులగు భావి
పౌరులకుఁ బ్రాథమికవిద్యాబోధమొనర్చి పునాదియందె జాతీయభావ

బీజముల నాఁటి వారి చిత్తసంస్కృతికి బాధ్యతవహింపఁదగు నేఁటి ప్రాథమికోన్నతపాఠశాలోపాధ్యాయులు కూటికి గుడ్డకుఁ జాలని స్వల్పవేతనములచేఁ బడుచున్న బాధలు, తన్నివారణమునకై ప్రభుత్వమునకు వారు గావించెడి మొఱలు నిప్పుడు దేశమెల్లెడ మాఱుమ్రోఁగుచున్న సంగతి యందఱెఱింగినదే. అందుకు సంబంధించిన దేయీ యేకపాత్రి నాటిక. ప్రజారాజ్యము నిది యొకపత్త్రముగా ముద్రింపఁబడినవి. ఇది 4 రంగములుగా రచితమయి యంతటను ఉపాధ్యాయుని యాత్మసంభాషణరూపకముగనే కూర్పఁబడినది. ఉపాధ్యాయుని కష్టములు, వేదనలు పాఠకుల మనముల కెక్కునట్లు వెలువరించుటకు వ్యావహారికభాషయే యుపయుక్త మగుననెడి యుద్దేశముతోఁగాఁబోలు నిది యామూలాగ్ర మాభాషతోడనే కూర్పఁబడినది. ఉపాధ్యాయపాత్రమున కిది యుచితమా యని మా సందేహము. వ్యాకరణమర్యాదలఁ బాటించుచో సులభశైలిలోఁ గూర్చెడి గ్రాంథిక రచనములు, భాషణములు పాఠకులయెడ నిట్టి ప్రయోజనమును సాధింపనేరవా ?

"ఆ! జర్మనీదేశంలో కామాలె పిల్లల్ని ఎక్కువ కన్నవాంళ్లకు బహుమానా లిస్తారట. పోనీ ఆదేశంలోన్నా పుట్టకపోతిని. ఊః! ఈనిర్భరదారిద్ర్యవేదనచేఁగాని, లేకపోతే సంతానం బరువైతుందా! చెట్టుకాయ చెట్టుకు బరువా ?"

ఇందు కామాలె, ఇస్తారట దేశంలోన్నా అనునవి, కావలె (కావలెను), ఇచ్చుదురట, దేశములోనయినను, అను గ్రాంథికభాషా రూపములకు భ్రష్టములుగా వీరువాడిన వ్యావహారికపదములని తలంతుము.

"నిర్భరదారిద్ర్యవేదన" అను సాంస్కృతికసమాసము నర్థము చేసికొనఁగల తెలుఁగువానికి వ్యాకరణభ్రష్టము లయిననేకాని పయి గ్రాంథికాంధ్రభాషాపదములు సులువుగ నర్థము కాఁజాలవా ?

ఇదియే సాహిత్యపరిషత్తునకు వ్యావహారిక భాషావాదులకుఁ గల ప్రధానమతవిభేదము. భాషాదేవి మంగళసూత్రము లనఁదగు వ్యాకరణసూత్రముల ననాలోచితముగ ననవసరముగఁ ద్రెంపివేయక వానిని బాటించుచునే చదువరులకు సుగమముగా నుండున ట్లింతసులభశైలిలోఁ గూర్చబడి రచనములకయినను సాహిత్యపరిషత్తు స్వాగత మొసంగఁగలదు. పలువిధములగు ప్రాంతీయభేదములతో, వివిధములగు వికృతాకృతులతో దారితెన్నులులేని వ్యావహారికపదములు జనసామాన్యమునకు సుబోధకములు కావనియే మా నమ్మకము.

మొత్తముమీఁద ఉపాధ్యాయవర్గముయొక్క కష్టములు, వాంఛితములు నిందు బాగుగానే వర్ణితములయినవి.

"నష్టంకలిగించే మద్రాసు ఎడ్యుకేషనల్ రూల్సులోని భాగాలను పూర్తిగా రద్దుచేయాలి. బొంబాయిరాష్ట్రంలో, కేరళరాష్ట్రంలో తమకోర్కెలకోసం సమ్మెలుచేసి విజయం పొందారు వుపాధ్యాయులు. ఏమైనాకానీయండి జవహారుపండితు డన్నట్లు విద్యాశాఖలో విప్లవం రావాలి- తప్పకుండా రావాలి; వెంటనే విప్లవం రావాలి." అను వాక్యములతో నాటికయొక్క యుపసంహార మొనర్పఁబడినది.

(3) జయభేరి:- వేంకటనరసయ్యగారు ప్రత్యేకముగ రచించిన ఖండకృతులనుగూర్చి సం. 45 సంచిక 5 లో సమీక్ష గావింపఁబడినది. దేశీయుల కుద్బోధము కలుగుటకై యీజంటకవు లిరువురు పెక్కుజాతీయవిషయములగూర్చి యప్పుడప్పుడు చెప్పిన చాటుపద్యములు, గేయములు సేకరింపఁబడి పతాకం, భారతి, గాంధిజి, నేతాజి, నెహ్రూజి, దేశసేవకులు, దేశభక్తులు, పట్టాభి, ప్రకాశం, రంగా, సోషలిజం, అబ్దులు గఫూరు, అజాద్, తెనుగుతల్లి, పంజాబు హత్యలు, పిలుపు, నిర్మాణకార్యక్రమసూత్రాలు, ఖద్దరు, మద్యపాననిషేధము,

హిందూముస్లిము మైత్రి, అస్పృశ్యత, ఆకాంక్ష, దేశగానం, విద్యార్థి, కాంగ్రెసుచరిత్ర, రైతు, కష్టజీవి, కార్మికుఁడు, ప్రయత్నము, యువకుఁడు, సామ్రాజ్యవాదము, ధనికవాదము, స్వాతంత్ర్యము, మంగళహారతి యను శీర్షికలక్రింద విభక్తములయి యాకృతిరూపమునఁ బ్రకటితములయినవి. పూర్వోక్తములయిన జాతీయనాటకములలో నాయా పాత్రములసంభాషణములలో సందర్భోచితముగఁ బెక్కుపద్యములు, గేయములు నిందలివే గ్రహింపఁబడినట్లు కానవగును.

"రచయితలు దేశభక్తులవుటచే నిది పెక్కు జాతీయసమస్యల నభివర్ణించి ప్రజాసముదాయమున స్వాతంత్ర్యకాంక్షను రేకెత్తించుచున్నది. ఇట్టికావ్యములు నేటిభారతమున కెంతేని వలసినవి" అని గ్రంథారంభమునఁ బ్రకటితమయిన యభినవతిక్కన తుమ్మల సీతారామమూర్తిగా రొసంగిన యభిప్రాయముతో మేముగూడ నేకీభవించుచున్నారము.

మచ్చునకుఁ గొన్ని తునకలు-

హిందు ముస్లిము మైత్రి

"మతము పేరిట రాజ్యాలు మనుటలేదు
మతము వేఱైన మాఱునా మానవత్వ
మదితలంచుము సోదరా యైక్యమగుము॥"

అస్పృశ్యత

"ధర్మము ధర్మమంచును సదా వచియింతురు ధర్మవన్నముల్
ధర్మమునందు లేదె దయ? దగ్గఱఁజేరఁగ భీయటంచు, పో
దుర్మతి దూరమంచు బహుదూషణచేయుట ధర్మమౌనొకో!
మర్మ మిఁకేలనయ్య దయమాలిన ధర్మము లున్నవే భువిన్".

జగత్కల్యాణసంధాయి కల్యాణబసవేశ్వరుఁడుగూఁడ "దయ యిల్లదె ధర్మవదావుదయ్యా" (దయలేని ధర్మ మదేమి యున్నది) అని లోకమును ధిట్టించి ప్రశ్నించినాఁడు.

(4) వయోజనవిద్య:– నేఁటి రాజ్యాంగవిధానములో ప్రజా ప్రతినిధులే ప్రభుత్వనిర్వాహకు లయియున్నారు. వయోజనులెల్ల వోటింగుహక్కు కలిగియున్నారు. అందుచే ప్రభుత్వమునకయి ప్రతి నిధుల నెన్నుకొనెడి ప్రజలు తమ హక్కులను బాధ్యతలను గుర్తించి తగినవారి నెన్నుకొనుటకుఁ దగినంతవిజ్ఞానవంతులు కావలసిన యావశ్య కత నేఁడు మఱింత హెచ్చినది. ప్రపంచమందలి దేశములలో భారత భూమియందే నేఁడు విద్యావిహీనులసంఖ్య యపరిమితముగా (నూటికి 85) నున్నది. అందుచే వయోజనులలో నిరక్షరాస్యతను నిర్మూలిం చుటకయి ప్రజలు, ప్రభుత్వము నిప్పుడు పలువిధములఁ బ్రయత్నింప వలసియున్నది. శ్రీ వేంకటనరసయ్యగారు రచించిన యీ చిన్నిపొత్తము వారి సమయాభిజ్ఞతకు దేశకాలజ్ఞతకు నాదర్శకముగా వెలయుచున్నది. గ్రామసేవ, గ్రంథాలయము, పండుగలు, ఆంధ్రదేశము, మాతృశ్రీ అనిబిసెంటు, కవితాపూజ, మనదేశము, భారతయాత్ర, ఆసియాఖం డము, ప్రపంచము అను శీర్షికలక్రింద నేఁడు ప్రజలు ముఖ్యముగా గ్రహింపఁదగు పెక్కువిషయము లుగ్గడింపఁబడినవి. ప్రతిశీర్షికక్రింద వయోజనవిద్యావశ్యకతను హెచ్చరించు పద్యమొకటి కూర్పఁబడినది. అందొకటి యుదాహరణము–

"గాలియు నీరముం జతత కాంక్షితముల్ గద జీవకోటి కీ
కాలమునందు విద్యయును గావలెనట్టులు సంతతప్రజా
పాలితవిశ్వభూవలయపౌరుల హక్కులు రక్షసేయఁగా
జాలమువీడి నేర్పవలె జాతికి విద్యను మించువేఁడుకన్."

బాపూజీ (రాష్ట్రపిత), రాజేంద్రప్రసాదు (రాష్ట్రపతి) మున్నగు దేశనాయకులు వయోజనవిద్యావ్యాప్తిని హెచ్చరించుచుఁ గావించిన పెక్కుసందేశములుగూడఁ జివరఁ బ్రకటితము లయినవి. చదువ నేర్చిన యాంధ్రసోదరులెల్ల సాదరముగ దీనిని బఠించి యుపయోగ

మొందఁదగును. అనుబంధముగాఁ జివరనున్నఁ "ఎందుకు చదువుకొనవలెను" అనెడి శార్వంపూడి నాగేంద్రుఁడుగారి చిన్నవ్యాసము, ప్రపంచమందలి వివిధదేశములలో నేఁడు చదువురానివారిసంఖ్య నూటికెంతయున్నది తెలుపు వివరణపట్టిక, "వివాదాలు" అను శీర్షిక క్రిందఁ జెప్పినసంగతులు మిక్కిలి యుపయుక్తమయినవి. విద్యావశ్యకత గూర్చి పూర్వకవులు చెప్పిన పద్యములు, నేఁటిగ్రంథాలయసాహిత్యముగూర్చిన వివరములు చివరఁ జేర్పఁబడినవి.

(౫) శరణాలయదాత :– పల్నాటిసోదరకవులని ప్రఖ్యాతిగన్న విశ్వబ్రాహ్మణ కవిద్వయములో శ్రీ వీరభద్రాచార్యులుగారు ద్వితీయులు సరసకవితావిశిష్టులు. చిలకలూరుపేటలో శ్రీ గంధి వరదయ్యశ్రేష్ఠి యను వైశ్యవదాన్యసత్తములు నెలకొల్పిన యనాథబాలబాలికా శరణాలయముయొక్క ప్రారంభోత్సవసమయమున జాస్తి వెంకటనరసయ్యగారి కోరికపయి శ్రీ వీరభద్రాచార్యులుగారు ఆశువుగా వరదయ్యగారి వదాన్యతను, కుటుంబగౌరవమును బ్రశంసించుచుఁ జెప్పిన పద్యములిందుఁ గలవు. చిలకలూరుపేటలోని వైశ్యశిఖామణులు పలువురు తమ ద్రవిణమును ధార్మికబుద్ధితో సద్వినియోగమొనర్చి ధర్మసంస్థలనేకములు నెలకొలిపియున్నారు. అందు రాచమల్లు కన్నయ్యగారి విద్యార్థివసతిగృహము, మైలవరపు గుండయ్యగారి ధర్మశాల, గ్రంథి వరదయ్యగారి యనాథశరణాలయము, హనుమాయమ్మగారి ధర్మసత్రము, గ్రంథాలయము, చలివేంద్ర మున్నగునవి గుణనీయములు. శరణాలయదాతగారి ప్రశంసాసందర్భమునఁ గవిగారు తదితరధర్మసంస్థల దాతలగూడ నిందు స్మరించి ప్రశంసించుట సముచితముగానున్నది. పుస్తకమున మొదటి రెండుసీసపద్యములలోఁ గావించిన చిలకలూరిపేట పురవర్ణనము హృదయంగమముగా నున్నది.

★

ननु उत्पद्यमान एव मौलोत्पाद उत्पादोत्पादं जनयति, तस्मान्मौलोत्पादो जनिष्यतीत्यत्राह—

अयमुत्पद्यमानस्ते काममुत्पादयेदिमम् ॥
तमुत्पादं स वाऽजातः कथमुत्पादयिष्यति ॥७॥

यद्ययं मौल उत्पाद उत्पद्यमानस्स्यात्तदा उत्पादोत्पादं जनयेदेव । स्वकारणाभावात्स्वयमजातः कथं तमुत्पादोत्पादं जनयिष्यतीति वक्तव्यम् ॥७॥

ननु उत्पादसिद्ध्यर्थमुत्पादान्तरं नाऽङ्गीक्रियते, यतोऽनवस्था स्यात् । किं तर्हि—

प्रदीपः स्वपरात्मानौ संप्रकाशयते यथा ।
उत्पादश्च परात्मानावुभावुत्पादयेत्तथा ॥८॥

यथा स्वप्रकाशस्वभावः प्रदीपः स्वात्मानमवभासयति, घटादींश्चावभासयति एवमुत्पादोप्युत्पादस्वभावः स्वात्मानमुत्पादयति । परानप्युत्पादयतीति भावः॥

स्यादेतदेवम्, यदि प्रदीपः स्वपरात्मानौ सम्प्रकाशयेत् । तदेव न सम्भवतीत्याह—

प्रदीपे नान्धकारोऽस्ति यत्र चाऽसौ प्रतिष्ठितः ।
किं प्रकाशयते दीपः प्रकाशो हि तमोवधः ॥९॥

प्रकाशो नाम तमसो वधः । तत्र तमः प्रदीपस्वात्मनि न सम्भवति । विरोधात् । तथा च प्रदीपस्य तमोवधरूपः प्रकाशो न स्वात्मनि सम्भवति । तस्मात्प्रदीपस्य स्वप्रकाशो नास्ति । नापि प्रदीपो यत्र देशे वर्तते तत्रापि देशे तमोऽस्ति यतस्तस्यान्धकारस्य वधेन प्रदीपस्य परप्रकाशकत्वं स्यात् । तस्मान्नास्ति प्रदीपस्य स्वपरप्रकाशकत्वम् । यदा चैयं तदा प्रदीपदृष्टान्तेनोत्पादस्य स्वपरोत्पादकत्वं दूरापास्तमिति भावः ॥९॥

ननु उत्पन्ने प्रदीपे तमो नास्ति, एवं प्रदीपो यत्र तिष्ठति तत्रापि तमो नास्ति । कुतः उत्पद्यमानेनैव प्रदीपेन तमोवधस्य कृतत्वात् । तस्मादस्ति प्रदीपे

तमोवधरूपः प्रकाशः। अन्यथा उत्पन्नेपि प्रदीपे प्रदीपानुत्पत्तिदशायामिव घटादयो नोपलभेरन्। एवं प्राप्ते प्रत्याचष्टे—

कथमुत्पद्यमानेन प्रदीपेन तमो हतम्।
नोत्पद्यमानो हि तमः प्रदीपः प्राप्नुते यतः ॥१०॥

इहान्धकारप्रदीपयोर्यौगपद्यं नास्ति, अत उत्पद्यमानोपि प्रदीपः कथमन्धकारं प्राप्नुयात्? कथं चाप्राप्तेन प्रदीपेन तमोवधः क्रियेत? तस्मान्नास्ति प्रदीपे तमोवधरूपः प्रकाश इत्यवसीयतामिति भावः ॥१०॥

नन्वप्राप्यैव चक्षू रूपं पश्यति, एवमप्राप्यैवाऽयस्कान्तो मणिमाकर्षति यथा तथैव प्रदीपोऽप्यप्राप्यैव तमो निहन्तीति ब्रूम इति चेदत्रोच्यते—

अप्राप्यैव प्रदीपेन यदि वा निहतं तमः।
इहस्थः सर्वलोकस्थं स तमो निहनिष्यति ॥११॥

यद्यप्यप्राप्यैव प्रदीपेन तमो निहतं तर्हीहस्थ एव प्रदीपः सर्वदेशस्थमप्यन्धकारं निहन्यात्। अप्राप्तेस्तुल्यत्वात्। एवं चाप्राप्तेनैव चक्षुषा रूपदर्शनं, अयस्कान्तेन च मणेराकर्षणमित्यादि भवदुदाहृतं साध्यसममिति भावः। नन्वेवं लोके दृश्यते, न हि दृष्टेऽनुपपत्तिर्नामेति चेत्सत्यं, लोकः पश्यति। तथाप्यविचारितरमणीयोयं लोकः तत्त्वनिरूपणावसरे न प्रमाणयितुमर्हति। गन्धर्वनगरादिवत्। तस्मान्निरुपपत्तिकोऽयं लौकिकव्यवहारस्तत्त्वनिरूपणावसरे नोदाहरणीय इति भावः ॥११॥

अपि च यथा प्रदीपः स्वपरात्मानौ सम्प्रकाशयतीति परिकल्प्यते, तथा अन्धकारोपि स्वपरात्मानौ छादयतीति कल्प्यतामित्याह—

प्रदीपः स्वपरात्मानौ सम्प्रकाशयते यदि।
तमोऽपि स्वपरात्मानौ छादयिष्यत्यसंशयम् ॥१२॥

प्रदीपप्रतिद्वन्द्वित्वात्तमोपि प्रदीपवत्स्वपरात्मगतं व्यापारं करिष्यत्येव। तथा च परवदात्मानमपि प्रच्छादयिष्यति। यदि चात्मानमपि छादयेत्तमः तदा तस्यैवानुपलब्धिः स्यात्। घटादिवत्तमसा आच्छादितत्वादिति भावः ॥१२॥

किंचान्यत्, यद्ययमुत्पादः स्वात्मानमुत्पादयेत् किमनुत्पन्न उत्पादयेदुतोत्पन्नः? उभयथापि न घटत इत्याह —

अनुत्पन्नोऽप्ययमुत्पादः स्वात्मानं जनयेत्कथम् ।
अथोत्पन्नो जनयते जातः किं जन्यते पुनः ॥१३॥

यद्यनुत्पन्न एवायमुत्पादः स्वात्मानं जनयेत्तर्हि वन्ध्यापुत्रोऽपि स्वात्मानं जनयेत् । तुल्यं ह्यविद्यमानत्वमुभयत्रापि । अथोत्पन्न उत्पादयेत्किमुत्पन्नस्योत्पादेन प्रयोजनम्? तदेवमुत्पादः स्वात्मानं न जनयतीति सिद्धम् ॥१३॥

इदानीं परमपि यथा नोत्पादयति तथा प्रतिपादयन्नाह—

नोत्पद्यमानं नोत्पन्नं नानुत्पन्नं कथंचन ।
उत्पद्यते तदा ख्यातं गम्यमानगतागतैः ॥१४॥

यदि हि किंचिदुत्पद्यते तदोत्पादस्तमुत्पादयेत् । तदेव न सम्भवति । यथा चोत्पद्यमानमुत्पन्नमनुत्पन्नं वा नोत्पद्यते तथा गतिपरीक्षायामेव गम्यमानगतागतैः प्रगेवोपपादितमिति भावः ॥१४॥

ननु उत्पन्नमुत्पद्यते, अनुत्पन्नमुत्पद्यते इति वा नोच्यते— अतीतवर्तमानयोरनागतवर्तमानयोश्च विरोधात् । किन्तूत्पद्यमानमेवोत्पद्यत इति ब्रूमः । तच्चास्त्यैव । यत्रचोत्पत्तिक्रिया दृश्यते तदुत्पद्यमानमिति व्यपदिश्यते । तस्मादुत्पत्तिसिद्धौ तं प्रतीत्योत्पद्यमानसिद्धेरुत्पद्यमानमुत्पादमुत्पादयतीत्यत्राह—

उत्पद्यमानमुत्पत्ताविदं न क्रमते यदा ।
कथमुत्पद्यमानं तु प्रतीत्योत्पत्तिमुच्यते ॥१५॥

यदुक्तमुत्पत्तिं प्रतीत्योत्पद्यमानं भवतीति तत्रैतद्वक्तव्यमस्योत्पत्तिं प्रतीत्येदमुत्पद्यमानं भवतीति विशेषतः । नहि तदुत्पद्यमानं विशेषतो निर्धारयितुं शक्यते इदं तदुत्पद्यमानमिति । कुतः? अनुत्पन्नत्वात् । एवमुत्पद्यमानासिद्धावुत्पत्तिक्रियापि नास्ति । कथमुत्पत्त्यामसत्यां तां प्रतीत्योत्पद्यमानसिद्धिः । तस्मादुत्पद्यमानमुत्पद्यते, तच्चोत्पादमुत्पादयतीत्येतदसङ्गतमेवेति भावः ॥१५॥

अत्राह– उत्पद्यमानमित्यादिना यदुक्तं तदयुक्तम्– कथम् , अस्योत्पत्तिं प्रतीत्येदमुत्पद्यमानं भवतीति विशेषतो निर्देष्टुं शक्यत एव। यथा घटस्योत्पत्तिं प्रतीत्य घट उत्पद्यमानो भवति, तत उत्पाद उत्पद्यमानमुत्पादयतीति। अत्रोच्यते-

न हि कश्चिदनुत्पन्नो भावस्संविद्यते क्वचित्।
यदि संविद्यते भावः कथमुत्पद्यते हि सः ॥१६॥

यो भाव उत्पत्तिक्रियां प्रतीत्योत्पद्यते तादृशः कश्चिदपि भावः कचिदप्युत्पादात्पूर्वं नास्ति। तस्मिन्नसति किमुत्पद्यते। किं वा समाश्रयते उत्पत्तिक्रिया। यदि चोत्पत्तेः पूर्वं भावस्संविद्यते तादृशो भावः पुनः कथमुत्पद्यत इति वक्तव्यम् ॥१६॥

एवं तावदुत्पद्यमानस्योत्पादो न घटत इत्युक्तम् , प्रकारान्तरेणापि दूषणमाह—

उत्पद्यमानमुत्पादो यदि चोत्पादयत्ययम्।
उत्पादयेत्तमुत्पादमुत्पादः कतमः पुनः ॥१७॥

यदि उत्पद्यमानमुत्पाद उत्पादयेत्तदा कतम उत्पादः कमुत्पादं जनयतीति वक्तव्यम्। यद्युत्पादस्य उत्पादकतया अपर उत्पादः कल्प्यते तदाऽनवस्था स्यात्॥

अथ उत्पादयत्येनमुत्पादो अनवस्थितिः।
अथोत्पादादनुत्पन्नं सर्वमुत्पद्यते तथा ॥१८॥

एकमुत्पादमपर उत्पादो जनयतीत्युक्तानवस्थितिः प्रागेवोक्ता, यदि चाऽनवस्थाभिया अपर उत्पादो नेष्यते तदा उत्पादं विनैवोत्पाद उत्पद्यत इति वक्तव्यम्। तथा सति उत्पादस्येव सर्वभावानामप्युत्पादं विनैवोत्पत्तिप्रसङ्गः प्राप्नोतीति भावः ॥१८॥

अपिचोत्पाद आत्मानं परांश्चोत्पादयतीत्यस्मिन्पक्षे अधुना दूषणमेव न वक्तव्यम्। यतः प्रागेवायं पक्षो दूषित इत्याह—

सतश्च तावदुत्पत्तिरसतश्च न युज्यते।
न सतश्चासतश्चेति पूर्वमेवोपपादितम् ॥१९॥

नैवासतो नैव सतः प्रत्ययोर्थस्य युज्यते ।
नसन्नासन्न सदसद्धर्मो निर्वर्तते यतः ॥२०॥

आदावेव प्रत्ययपरीक्षायामेतद्व्याख्यातम्, एवमुत्पादे निषिद्धे उत्पद्यमानमुत्पाद उत्पादयति, स्वपरात्मानौवा उत्पादयतीत्यस्याः कल्पनाया नास्त्यवकाशः॥

नन्वेवं प्रतीत्यसमुत्पादलक्षणं बौद्धानां परमार्थसत्यं निराकुर्वता भवता बौद्धसिद्धान्त एव निराकृत इति चेदुच्यते, इदं प्रतीत्येदं भवतीति वदता भगवता बुद्धेनैव सर्वधर्माणां निस्स्वभावत्वमेव दर्शितमित्याह—

प्रतीत्य यद्यद्भवति तत्तच्छान्तं स्वभावतः ।
तस्मादुत्पद्यमानं च शान्तमुत्पत्तिरेव च ॥२१॥

यो हि पदार्थो विद्यते स स्वभावं न जहाति । तथा च विद्यमानो भावः कदापि विद्यमानतां न मुञ्चति । नाऽन्यदपेक्षते विद्यमानतायाम् । तथा च प्रतीत्यसमुत्पादमुपदिशता भगवता यद्यत्प्रतीत्य भवति तत्स्वभावतश्शान्तम्=विरहितमित्यावेदितमेव । अतश्चोत्पद्यमानमुत्पत्तिरपि शून्यैवेति भगवदभिप्रायाऽविरुद्धमेवोक्तमस्माभिरिति भावः ॥२१॥

किञ्चाऽयं परिकल्प्यमान उत्पादः किं निरुध्यमानस्य कल्प्यते, उताऽनिरुध्यमानस्य? उभयथापि न घटत इत्याह—

निरुध्यमानस्योत्पत्तिर्न भावस्योपपद्यते ।
यश्चानिरुध्यमानस्तु स भावो नोपपद्यते ॥२२॥

तत्र निरुध्यमानस्य वर्तमानत्वात्तस्योत्पादो नाऽवकल्पते । अनिरुध्यमानस्याप्यतीतस्यानागतस्य वा खपुष्पवद्भावलक्षणरहितस्याविद्यमानत्वादेव तस्याप्युत्पादो न युक्तिसहः ॥२२॥

ननूत्पादो विद्यते, तद्भावभाविनो धर्मस्य सत्त्वात् । तथा हि, स्थितिरुत्पादभावभाविनी धर्मः । अनुत्पन्नस्य स्थित्यसम्भवात् । तस्मादुत्पादभावभाविन्याः स्थितेस्सत्त्वादुत्पादोप्यस्तीति चेत्तत्राह—

स्थितिर्निरुध्यमानस्य न भावस्योपपद्यते ।
यश्चानिरुध्यमानस्तु स भावो नोपपद्यते ॥२३॥

येयं स्थितिरुक्ता सा किं निरुध्यमानस्य भावस्य स्यादुताऽनिरुध्यमानस्य? उभयथापि न सम्भवति। तथाहि, निरुध्यमानस्य निरोधाभिमुखस्य भावस्य तद्विरोधिनी स्थितिर्न सम्भवति। अनिरुध्यमानो भाव एव नास्ति। कथं तत्र स्थितिसम्भवः ॥२३॥

किंच जरसा मरणेन च सर्व एव भावाः क्षणमपि न त्यज्यन्ते, तथाच एतादृशेषु भावेषु कथं स्थितेरवकाश इत्याह—

जरामरणधर्मेषु सर्वभावेषु सर्वदा।
तिष्ठंति कतमे भावाः जरामरणमन्तरा ॥२४॥

ये भावा जरामरणरहिताः तेषु स्थितिः स्यात्। तादृशा भावा एव न सन्ति। तथा च कुत्र स्थितिस्सम्भवतीति भावः ॥२४॥

किं चास्याः स्थितेः स्थापनार्थमन्या वा स्थितिरङ्गीक्रियते, उतेयं स्थितिः स्वात्मानं स्वयमेव स्थापयति? उभयथापि न सम्भवतीत्याह—

स्थित्याऽन्यया स्थितेः स्थानं तयैव च न युज्यते।
उत्पादस्य यथोत्पादो नात्मना न परात्मना ॥२५॥

अन्यया स्थित्या स्थितेः स्थानमिति न सम्भवति। अनवस्थाप्रसङ्गात्। एवं स्थितेः स्वात्मनैवास्थानमित्यपि न सम्भवति। उत्पादसन्दर्भोक्तदूषणाऽनतिलङ्घनादिति भावः ॥२५॥

किञ्च—

अस्थितास्थितिरेषा तु स्वात्मानं स्थापयेत्कथम्।
स्थिता चेत्स्थापयत्येषा स्थितायां स्थाप्यतेऽथ किम् ॥२६॥

यद्येषा स्थितिः स्वात्मना अस्थिता तदा कथमात्मानं स्थापयति? यदि च स्थिता तदा स्थापनापेक्षाया अभावात् किं स्थापयेत ॥२६॥

ननु स्थित्युत्पादौ तिष्ठतः, कथं तत्सहचारिणो निरोधस्य सत्त्वादित्यत आह—

निरुध्यते नाऽनिरुद्धं न निरुद्धं निरुध्यते।
निरुध्यमानमपि न किमजातं निरुध्यते ॥२७॥

अनिरुद्धं न निरुध्यते, तत्र निरोधस्यैवाऽभावात् । निरुद्धमपि न निरुध्यते । निरोधद्वयप्रसङ्गात् । निरुद्धाऽनिद्धरुविलक्षणस्य निरुध्यमानस्याभावादेव निरुध्यमानमपि न निरुध्यते । किंच प्रागुक्तरीत्या उत्पादस्याऽसम्भवान्निरोध एव नोपपद्यत इत्याशयेनाह—किमजातमिति । ॥२७॥

किंचाऽयं निरोधः स्थितस्य वा भावस्य स्यादुताऽस्थितस्य वा? उभयथाऽपि न घटत इत्याह—

स्थितस्य तावद्भावस्य निरोधो नोपपद्यते ।
नाऽस्थितस्यापि भावस्य निरोध उपपद्यते ॥२८॥

स्थितस्य भावस्य स्थितत्वादेव न निरोधः । अस्थितस्यापि भावस्याऽविद्यमानत्वादेव निरोधोऽनुपपन्नः । तस्मान्नास्ति निरोध इति भावः ॥२९॥

किंच यदि निरोधस्स्यात्तयैवाऽवस्थया तस्या एवावस्थायाः स्यात् । अन्यया वा अवस्थया अन्यस्या अवस्थायाः । सर्वथापि न सम्भवतीत्याह—

तयैवाऽवस्थया तस्या न हि सैव निरुध्यते ।
अन्ययाऽवस्थयाऽवस्था न चान्यैव निरुध्यते ॥२९॥

न तावत्क्षीरावस्थया सैव क्षीरावस्था निरुध्यते । स्वात्मनि क्रियाविरोधात् । नाप्यन्यया दध्यवस्थया अन्या क्षीरावस्था निरुध्यते । विनाश्यविनाशकयोः दधिक्षीरावस्थयोः यौगपद्याभावत् । विद्यमानयोरेव विनाश्यविनाशकभावः, नतु विद्यमानाऽविद्यमानयोः । तस्मादन्ययाप्यवस्थयाऽन्या अवस्था न निरुध्यत इति भावः॥

यथैव सर्वधर्माणामुत्पादो नोपपद्यते ।
तथैव सर्वधर्माणां निरोधो नोपपद्यते ॥३०॥

प्रागुक्तयुक्तिभिरुत्पादवत्सर्वेषां भावानां निरोधोपि न सम्भवतीति भावः॥

अपि च निरोधो नाम यदि कश्चित्स्यात् स सतो वा भावस्य स्यादसतो वा? तत्राह—

सतश्च तावद्भावस्य निरोधो नोपपद्यते ।
एकत्वे, नहि भावश्च नाभावश्चोपपद्यते ॥३१॥

सतस्स्वभावादप्रच्युतस्य भावस्य निरोधो नास्ति, निरोधो नाम असत्त्वम्।

अभाव इति यावत्। तदाचैकस्मिन् वस्तुनि सत्त्वमसत्त्वं चेति विरुद्धं धर्मद्वयं न सम्भवति। तथासत्येक एव धर्मो भावोऽभावश्चेति वक्तव्यः। स च नोपपद्यते। तस्मान्नास्ति सतो भावस्य निरोध इति भावः ॥२१॥

इदानीमसतोऽपि निरोधो नास्तीत्याह—

असतश्चापि भावस्य निरोधो नोपपद्यते।
न द्वितीयस्य शिरसश्छेदनं विद्यते यथा ॥२२॥

असतो भावस्याऽसत्त्वादेव निरोधो नास्ति। तत्र दृष्टान्तमाह—न द्वितीयस्येत्यादि। यथा द्वितीयस्य शिरसोऽसत्वाच्छेदनं न सम्भवति एवमसतोऽपि भावस्य निरोधोपि न सम्भवतीति भावः ॥२२॥

यदि निरोधो नाम भावानां कल्प्यते तस्य किमन्यो निरोध इष्यते,उत न? यदीष्यते, तत्राह—

न स्वात्मना निरोधोऽस्ति निरोधो न परात्मना।
उत्पादस्य यदोत्पादो नात्मना न परात्मना ॥२३॥

यथैवोत्पादस्य उत्पादः स्वात्मना, परात्मना वा न घटते एवं निरोधस्यापि स्वात्मना, परात्मना वा निरोधो न सम्भवतीति भावः ॥२३॥

नन्वेवमुत्पादस्थितिभङ्गाः संस्कृतस्य निषिद्धाः, तथापि संस्कृतमस्ति, विशेषलक्षणोपदेशात्। काठिन्यादिकं च तस्य विशेषलक्षणमुपदिश्यत इतिचेत्तत्राह—

उत्पादस्थितिभङ्गानामसिद्धेर्नास्ति संस्कृतम्।
संस्कृतस्याप्रसिद्धौ च कथं सेत्स्यत्यसंस्कृतम् ॥२४॥

यथोक्तेन न्यायेन यदा उत्पादस्थितिभङ्गा निषिद्धास्तदा कथं संस्कृतं, तद्विशेषलक्षणं च सेत्स्यतीति वक्तव्यम्। अत्र केचिदाकाश, प्रतिसङ्ख्यानिरोध, निर्वाणान्यसंस्कृतानीति कल्पयन्ति। अन्ये तु शून्यतामसंस्कृतां वर्णयन्ति। तदेतत्सर्वं संस्कृतस्याप्रसिद्धौ न सम्भवतीत्याह—संस्कृतस्येति। यदा च संस्कृतमेव नास्ति तदा असंस्कृतमपि न सिद्ध्यतीति भावः ॥२४॥

नन्वेवमुत्पादादीनामभावे 'उत्पादोप्यस्ति व्ययोप्यस्ति' इत्यादिभगवदुपदेशः कथं घटतामिति तत्राह—

# ఆంధ్రసాహిత్యపరిషత్ప్రచురణములు

| | | |
|---|---|---|
| 1. | ఆకారాద్యముద్రితగ్రంథసూచిక | 0- 8.0 |
| 2. | అమరుకము-జయంతి రామయ్యపంతులుగారు | 1- 0.0 |
| 3. | అఱవదేశమునందలి ఆంధ్రవాఙ్మయము-ఆ. ఉమాకాంతముగారు | 0- 4.0 |
| 4. | ఆర్యభాషావిభాగము | 0- 8.0 |
| 5. | ఆంధ్రధాతుమాల | 1- 0.0 |
| 6. | ఆంధ్రసాహిత్యపరిషద్వృత్తాంతము | 0- 8.0 |
| 7. | ఆంధ్రకౌముది-గణపవరపు వేంకటపతికవి | 0.12.0 |
| 8. | ఆంధ్రశబ్దచింతామణి-ఎలకూచి బాలసరస్వతి | 0.12.0 |
| 9. | ఆధునికాంధ్రవాఙ్మయవికాసవైఖరి-జ. రా. పంతులు | 1- 8-0 |
| 10. | ఉత్తరరామచరిత్రము-జ. రా. పంతులు | 1- 0.0 |
| 11. | ఉన్మాదసహస్రము (వెఱ్ఱి వేయివిధములు) కొత్తపల్లి సూర్యారావు | 0.12.0 |
| 12. | ఉషాపరిణయము — పసుపులేటి రంగాజమ్మ | 1- 4.0 |
| 13. | కవిజనసంజీవని—సమస్యలు-శ్రీకోటి రఘునాథ తొండమాన్ | 0- 4.0 |
| 14. | కవిజనాశ్రయము | 0.10.0 |
| 15. | కావ్యాలంకారచూడామణి—పాఠభేదములు | 0- 8.0 |
| 16. | ,, చూడామణి 8.9 ఉల్లాసములు—విన్నకోట పెద్దన్న | 0- 8.0 |
| 17. | కాళిందీకన్యాపరిణయము-అహోబలపతి (ప్రథమభాగము) | 1- 0-0 |
| 18. | డిటో (ద్వితీయభాగము) | 0- 8.0 |
| 19. | చంద్రభానుచరిత్రము—తరిగొప్పుల మల్లనకవి | 1- 0.0 |
| 20. | చంపూరామాయణము (ఆంధ్రము) జ. రా. పంతులు | 1- 0.0 |
| 21. | ,, ఋగ్వేదకవి వెంకటాచలపతి | 1- 0.0 |
| 22. | చాటుధారాచమత్కారసారః-(సంస్కృతము) | 0- 8.0 |
| 23. | జ్ఞానప్రసూనాంబికా శతకము | 0- 4-0 |
| 24. | జైమినిభారతము-సముఖము వేంకటకృష్ణప్పనాయకుఁడు | 1- 8.0 |
| 25. | జ్యోతిశ్శాస్త్రసారము-కపిస్థలం కృష్ణమాచార్యులుగారు | 0- 8.0 |
| 26. | నమస్కారములు-కొత్తపల్లి సూర్యారావు | 0- 4.0 |
| 27. | నారసింహపురాణము-హరిభట్టారకుఁడు | 1- 0.0 |
| 28. | సూత్రాంధ్రవ్యాకరణము-చిన్నయసూరి | 0.12-0 |
| 29. | నీతిపద్యముక్తావళి-బద్దెన | 0.12-0 |

| | | |
|---|---|---|
| 30. | నీతిభవనము | 0- 4-0 |
| 31. | పరిషత్పుస్తకభాండాగారము 2వ భాగము | 1- 0-0 |
| 32. | ,, 3వ భాగము | 1- 0-0 |
| 33. | ప్రాకృతభాషోత్పత్తి-శ్రీమాన్ మే. వెం. రమణాచార్యులుగారు | 0-12-0 |
| 34. | బాలభారతము.(అగస్త్యకృతమునకు తెలుగు) | 1- 8-0 |
| 35. | మన్నారు దాసవిలాస నాటకము-రంగాజమ్మ | 0-12-0 |
| 36. | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము | 1- 0-0 |
| 37. | రసాభరణము-అనంతకవి | 0-12-0 |
| 38. | రసార్ణవాలంకారము—ప్రకాశవర్షకవి | 0- 8-0 |
| 39. | రఘునాథ రామాయణము (ప్రథమభాగము) | 0-12-0 |
| 40. | రజతోత్సవసంపుటము (ఆంధ్రసాహిత్యపరిషత్తు) | 1- 8-0 |
| 41. | రాయవాచకము-విశ్వనాథనాయని స్థానపతి | 1- 0-0 |
| 42. | రాధికాసాంత్వనము-సముఖము వేంకటకృష్ణప్పనాయకుఁడు | 1- 0-0 |
| 43. | రెడ్డినాటి రెండు శాసనములు | 0- 8-0 |
| 44. | లక్షణసారసంగ్రహము | 1- 0-0 |
| 45. | విప్రనారాయణ చరిత్రము-చదలవాడ మల్లన్న | 1- 0-0 |
| 46. | లౌకికన్యాయవివరణము-శ్రీమాన్ మే. వెం. రమణాచార్యులుగారు | 0-12-0 |
| 47. | శతకసముచ్చయము (మొదటిభాగము) | 1- 0-0 |
| 48. | ,, (ద్వితీయభాగము) | 1- 0-0 |
| 49. | శాసనపద్యమంజరి (మొదటిభాగము) | 1- 0-0 |
| 50. | ,, (ద్వితీయభాగము) | 0- 8-0 |
| 51. | శివరాత్రిమాహాత్మ్యము-శ్రీనాథమహాకవి | 1- 4-0 |
| 52. | షోడశకుమార చరిత్రము-వెన్నెలకంటి అన్నమయ్య | 1- 0-0 |
| 53. | సర్వేశ్వర శతకము-యథావాక్కుల అన్నమయ్య | 0- 4-0 |
| 54 | స్వప్నవాసవదత్త-భాసకృతి కనువాదము | 1- 6-0 |
| 55. | సాంబోపాఖ్యానము-రామరాజు రంగప్పరాజు | 1- 0-0 |
| 56. | సింహాసనద్వాత్రింశిక-కొఱవి గోపరాజు | 1- 0-0 |
| 57. | ,, (ద్వితీయభాగము) | 1- 0-0 |
| 58. | ఈశానసంహిత | 0- 8-0 |
| 59. | ప్రాస్తావిక పద్యావళి | 0- 8-0 |
| 60. | 42-వార్షికమహాసభ-వ్యాసములు- 250 పుటలు | 1- 8-0 |